# విషయ సూచిక


| | |
|---|---|
| నాగార్జునసాగర్ ప్రాజెక్టు | ౧ |
| పంచవర్ష ప్రణాళిక - ఉద్యోగులు | ౧౧ |
| పోలీసుశాఖ రివాజా వ్యవస్థ | ౧౬ |
| వార్తా చిత్రాలు | ౨౧ |
| టెలిఫోను ఎలా వినబడుతుంది ? | ౩౦ |
| జోగిపేటలో సహకారి సప్తాహం | ౩౨ |
| హైదరాబాదు రాష్ట్ర పరిశ్రమలకు ఉజ్జ్వల భవిష్యత్తు | ౩౪ |
| తప్పుడు తూకములు - కొలమానముల పద్ధతి | ౩౮ |
| రాజా మహీపతి రాం | ౪౧ |
| వార్తలు - విశేషాలు | ౪౬ |




కెలిసంపదం చిత్రాలు :



ముఖచిత్రం :
హైదరాబాదువైపు నాగార్జునసాగర్
డాము స్థలంవద్ద ప్రతిష్ఠింపబడిన
శిలాస్తంభం.

ప్రధానమంత్రి నెహ్రూ ౧౯౫౫ డిసెంబరు
౧౦ వ తేదీన దీనిని ఆవిష్కరించారు.



వెనుక కవరు :
ఆంధ్రరాష్ట్రంవైపు నాగార్జునసాగర్
డాముకు శంకుస్థాపన చేస్తున్న
ప్రధాని నెహ్రూ.

హైదరాబాదు పౌరసంబంధముల శాఖచే ప్రచురింపబడి అజంతా ప్రింటర్సులో ముద్రింపబడినది.

నాగార్జున సాగర్ ప్రాజెక్టు : నెహ్రూచే శంకుస్థాపన

# "భారతదేశంలో నిర్మింపబడుతున్న నూతన మందిరాలకు చిహ్నప్రాయమైన నిర్మాణం"



*"నేను నాగార్జున సాగర్‌కు శంకుస్థాపన చేయడం నాకొక పవిత్రమైన కార్యంగా భావిస్తున్నాను. భారత దేశంలో మానవత్వామందిరానికిది శంకుస్థాపన. దేశమంతటా మనం నిర్మిస్తున్న మందిరాల కిది చిహ్నప్రాయిమైన నిర్మాణం" అంటూ ప్రధానమంత్రి శ్రీ జవహరలాలు నెహ్రూ కృష్ణానదిపై ఆంధ్ర హైదరాబాదు ప్రభుత్వాలు ఉమ్మడిగా నిర్మిస్తున్న నాగార్జున సాగర్ ఆనకట్టకు ౧౯౫౫ డిసెంబరు ౧౦ వ తేదీన శంకుస్థాపన చేశారు.*

ఆంధ్ర హైదరాబాదు రాష్ట్రాల ప్రజలకు అది ఒక శుభదినం: ఆనాడు వేలాది ప్రజలు ఆ శంకుస్థాపనోత్సవాన్ని దర్శించడానికి డాము స్థలానికి వచ్చారు. అలా వచ్చే ప్రజల సౌకర్యార్థమై ఉభయరాష్ట్రాల ప్రభుత్వాలు ప్రత్యేకంగా ఏర్పాట్లుచేశాయి.

డిసెంబరు ౧౦ వ తేదీ ఉదయమే ఈ ఉత్సవం జరిగింది. విపరీతమైన చలిలోకూడా వేలాది గ్రామస్తులు పండిత నెహ్రూ దర్శనార్థమై ఒక రాత్రి అంతా వేచివున్నారు. కృష్ణానదికి ఇరు ప్రక్కలావున్న లక్షలాది తెలుగు ప్రజలు ఎంతో కాలంనుంచీ పెట్టుకున్న ఆశలు ఆనాడు ఫలించినవి. వారి స్వప్నాలు ఒక స్థిర రూపందాల్చి అవతరించే సుసమయం ఆనాడు కలిగింది.

ఆంధ్ర ముఖ్యమంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారు ప్రధాన మంత్రికి స్వాగతం చెబుతూ ప్రాజెక్టుకు శంకుస్థాపన చేయవలసిందిగా అభ్యర్థించారు. నాదస్వర మంగళ తూర్యారావాలు కర్ణపేయంగా వినిపిస్తుండగా, పండితులు వేద మంత్రాలను పఠిస్తూ ఉండగా, శ్రీ నెహ్రూ తాపీతో పునాది రాయిని స్థాపించి కొబ్బరి కాయలు కొట్టి నాగార్జున సాగర్ నిర్మాణానికి శంకుస్థాపన చేశారు.

## "ఉత్తమ ప్రార్థన"

ప్రధాన మంత్రి మొదట హిందీలోను, ఆ తరువాత ఇంగ్లీషులోను ప్రసంగిస్తూ ప్రజలు తమ వారసత్వాన్నీ, పురావైభవాన్నీ దృష్టియందుంచుకొని యావజ్జాతి శ్రేయస్సుకొరకై కృషిచేయాలని ప్రబోధించారు. నాగార్జున సాగర్ ప్రాజెక్టు భారత ప్రజలు లభించే భావి అభ్యుదయానికి మాత్రమే చిహ్నంగా కాక, వారికి ఘనతను చేకూర్చినట్టి ప్రాచీన వైభవానికికూడా జ్ఞాపక చిహ్నంగా వుండగలదనీ శ్రీ నెహ్రూ అన్నారు. "భారతదేశం విజ్ఞానపీఠంగావుండి తన విజ్ఞాన దీధితులను ఇరుగుపొరుగు దేశాలకు, మిత్రులకు ఉదారంగా ప్రసాదింపజేసిన మన గతవైభవాన్ని ఒకమారు స్మరించుదాము. రెండువేల సంవత్సరాల తరువాత మనం మరల నేడు స్వతంత్రులమయ్యాము. మళ్ళీ మన ఇరుగు పొరుగు దేశాలతో మన ప్రాచీన సంబంధబాంధవ్యాలను పునరుద్ధరించుకున్నాము. ఈ దేశాలవారి మందరం శాంతికీ, మానవజాతి అభ్యుదయానికీ సమిష్టిగా కృషిచేయగలమని ఆశిస్తున్నాను. నేడు మన దేశంలో ప్రారంభిస్తున్న మహాకార్యానికి నాగార్జునసాగర్ ఒక చిహ్నం.

ఈ మహాకార్యాలు తలపెట్టిన మనను మన పూర్వీకులు ఆశీర్వదిస్తారని విశ్వసిస్తున్నాను. ఈనాడు మనం ఆచరించగల ఉత్తమ ప్రార్థన ఏది ? మనం నిర్మించగల ఉత్తమ మందిర మేది ? ప్రజల దుఃఖదారిద్ర్యాలను తొలగించగల కార్యమే మహితమైన మందిరం, కనుక మన ప్రజలు సిరిసంపదలను పొంది వర్ధిల్లాలనీ వారి కష్టాలు తొలగిపోవాలనీ మనం ప్రార్థన సలుపుదాము" అని శ్రీ నెహ్రూ అన్నారు.

ప్రధానమంత్రి ప్రాజెక్టు నమూనాను పరిశీలించి హైదరాబాదువైపు నాగార్జున సాగర్ శంకుస్థాపనకు స్మారక చిహ్నంగా ప్రతిష్ఠింపబడిన ౩౪ అడుగుల నల్లరాతి స్తంభాన్ని ఆవిష్కరించారు. ఈ స్తంభానికి ఒక వైపు అశోకచక్రం, మరొకవైపు బుద్ధుని విగ్రహం, మూడవవైపు నాగార్జునుని విగ్రహం, నాలుగవవైపున వృషభం — న్యాయ, సహన, విజ్ఞాన, కాయకష్టాలకు చిహ్నంగా చెక్కబడ్డాయి.

## రిజర్వాయర్ విశేషాలు

నాగార్జున సాగర్ రిజర్వాయర్ పరిమాణం భాక్రా, హీరాకుడ్ రిజర్వాయర్లకంటె పెద్దది. ప్రస్తుతం కృష్ణా డెల్టాలో వినియోగించబడుతున్న నీటికంటె నాగార్జున సాగర్ క్రింద దాదాపు మూడురెట్ల నీరు వినియోగానికి తేబడుతుంది. అంటే ౧౦౭ లక్షల ఎకరా - అడుగుల నీరు వినియోగమవుతుంది. రిజర్వాయర్‌కు రెండు వైపుల త్రవ్వబడే కాలువలనుండి మొత్తం ౩౩,౦౦౦ క్యూజెక్కుల నీరు ఉపయోగానికి వస్తుంది. భారత



*1955 డిసెంబరు 10 వ తేదీన నాగార్జునసాగర్ డాముకు శంకుస్థాపన చిహ్నంగా ప్రతిష్ఠింపబడిన శిలాస్తంభాన్ని ఆవిష్కరించడానికై ఆంధ్రవైపునుంచి హైద్రాబాదువైపుకు వస్తున్న ప్రధాని శ్రీ నెహ్రూ.*



హైదరాబాదు వైపున నాగార్జున సాగర్ డాముకు ప్రధాని శ్రీ నెహ్రూ శంకుస్థాపనచేసిన సందర్భంలో అచటికి వచ్చిన మహాజనం దృశ్యం.

దేశంలో ఇతర రిజర్వాయర్లన్నిటికంటె ఈ విని మయం అధికమైనది. కుడివైపు కాలువనుండి ౨౧,౦౦౦ క్యూజెక్కుల నీరు ప్రవహిస్తుంది. భూము లకు నీటిని సప్లయి చేసే కాలువలలో ఇది ప్రపంచం మొత్తంలోనే పెద్దకాలువ అని చెప్పాలి.

కృష్ణానదిపై ఇటువంటి ప్రాజెక్టును నిర్మించాలని మొదట యోచించినవారు స్వర్గీయులయిన నవాబ్ అలీ నవాజ్ జంగ్. ఆంధ్ర, హైదరాబాదు రాష్ట్రాలు కలిసి దీనిని నిర్మింపనున్నవి. నందికొండవద్ద యఫ్. ఆర్. యల్ +౫౯౦ పరిమాణం గల ఒక డామ్, నదికి రెండువైపులా రెండుకాలువలు నిర్మింప బడవలసి వున్నవి. డామ్ కట్టడానికి నిర్ణయింపబడిన స్థలం ఎంతో అనువైనది. పునాదులు సర్వోత్తమంగా వున్నవి, నిర్మాణానికి కావలసిన రాయి మొదలయి నవి ఆ స్థలానికి చేరువగా లభిస్తవి. మునిగిపోయే నేల చాలాపరకు నిర్జనమైన పర్వతారణ్య సీమ.

కృష్ణ లోతుగా ప్రవహించే నది. దానికి చుట్టుపట్ల చాలాచోట్ల వాన సరిగా పడదు. ఈ నది అరగాణిలో వున్నంత క్షామపీడితమైన భూమి భారతదేశంలో మరి ఏనది లోయలోనూ లేదు. ముఖ్యంగా నైరుతి పవ నాలమీద ఆధారపడివున్న ఈ కృష్ణాప్రాంతంలో జూన్ నుండి అక్టోబరు నెలవరకు పదిలక్షల క్యూజె క్కుల జలం నదిలో ప్రవహిస్తుంది. నైలునది. కావేరీ నదులకంటె రెండింతలు వరదప్రవాహం కృష్ణలో వస్తుంది. కాని దక్కన్ నదులకు సహజ మైనట్లుగానే దీనిలో వేసవికాలం జలం ౧౦౦ క్యూ

సెక్కుల వరకు తగ్గిపోతూవుంటుంది. ఏటేటా నిశ్చితంగా వచ్చేప్రవాహం ౧౭౧౫ టి. యమ్. ఘనపు టడుగులు. దీనిలో నాలుగోవంతు మాత్రమే ఇప్పుడు ఉపయోగించబడుతున్నది. ఇంకో ఐదోవంతుజలాన్ని ఉపయోగించుకొనడానికి బొంబాయి, మైసూరు, హైదరాబాదు, ఆంధ్ర రాష్ట్రాలలో కార్యక్రమం నడుస్తున్నది. మిగిలిన జలాలను వివిధ రాష్ట్రాలకు ౧౯౫౧ లో జరిగిన రాష్ట్రాలసభలో ప్లానింగు కమీషన్‌వారు కేటాయించినారు. ఈ పంపిణీని అనుసరించి కట్టబోతున్న ప్రాజెక్టులలో నాగార్జున సాగరం ఒకటి. దీనివల్ల ౪౬౪ టి. యం. ఘనపు టడుగుల జలం కాలువల్లోకి ప్రవహిస్తుంది. నదికి కుడివైపున గుంటూరు, నెల్లూరు జిల్లాలలోని బంజరు భూములకు ఎడమ వైపున నల్లగొండ, ఖమ్మం, కృష్ణాజిల్లాలలోని భూములకు నీటి సరఫరా జరుగుతుంది.

నది మట్టానికి ౩౬౬ అడుగుల ఎత్తువరకు డామ్ కట్టబడుతుంది. దీనిలో స్పిల్వే భాగం ౧౮౮౦ అడుగుల పొడవై, ౧౦.౪౬ లక్షల క్యూసెక్కుల నీరు వదులుతుంది. దీని కిరుప్రక్కలా వరదప్రవాహం లేనిభాగం ౨౦౨౦ అడుగుల పొడవున వుంటుంది. రాతి కట్టడం పూర్తిపొడవు ౩౯౦౦ అడుగులు. దీని తర్వాత రెండు ప్రక్కలా కట్టడం ౪౯౬౦ అడుగుల వరకు ఉంటుంది. ఎడమప్రక్క ఒక మట్టికట్ట కూడా వేస్తారు. ఇది ౬౨౨౦ అడుగుల పొడవుగా ౬. అడుగుల ఎత్తుగా వుంటుంది.

*జలాశయం నిర్మితమైన తరువాత కలిగే ఉపయోగాలు ఇవి :* ౧. నీటి సరఫరా, ౨. విద్యుచ్ఛక్తి సప్లయి, ౩. వరదలను అరికట్టడం.

ఈ ప్రాజెక్టు నిర్మాణానికి ౯ ఏండ్లు పట్టవచ్చు ౧౨౨.౦౨ కోట్ల రూపాయల ఖర్చు అవుతుంది. దీని



*హైదరాబాదు వైపున మహాసభలో ప్రసంగిస్తున్న శ్రీ నెహ్రూ.*



*శిలాస్తంభాన్ని ఆవిష్కరించిన తరువాత ప్రధాని అక్కడినుంచి తిరిగి ఆంధ్రరాష్ట్రంవైపుకు వెళ్లుతున్నారు.*

మీద నూటికి ౪.౨౩ వంతుల చొప్పున ఆదాయం రాగలదని అంచెనా. విద్యుచ్ఛక్తినికూడా లెక్కలోకి తీసుకొంటే ఆదాయం నూటికి ౫.౬౩ వంతులదాకా పెరుగుతుంది.

నాగార్జున సాగరం జలాశయంలో +౫౯౦ వరకు ౯౩ లక్షల ఎకరాల అడుగులు. (౪౦౦ టి. యం. ఘనపుటడుగులు) నీరు వుంటుంది. ప్రవహించేనీరు ౫.౩౯ యం. ఎ. సి. అడుగులు వుంటుంది, +౫౯౦ వరకు జలవైశాల్యం ౧౧౦ చదరపు మైళ్ళు. నీటి సరఫరాకు నిర్ణయించుకున్న పనుల ననుసరించి డాము వద్ద ఆంధ్ర భాగంలో ౩౦౩ టి. యం. ఘనపుటడుగులు, హైదరాబాదు ఆయకట్టులో ౧౬౧ టి. యం. ఘనపుటడుగులు ఉపయోగించుకుంటారు.

## కుడిప్రక్క కాలువ

నదికి కుడివైపు కాలువ ఒకమైలు ఆరు ఫర్లాంగుల వరకు జంట సొరంగాలగుండా బయలుదేరుతుంది. ఈ సొరంగాలు ఒక్కొక్కటి ౨౯ అడుగుల వ్యాసంతో ఉంటవి. కాలువ పూర్తి అయిన తరువాత అందులో ౨౧౦౦౦ క్యూసెక్కుల నీరు ప్రవహిస్తుంది. ప్రారంభంలో వుండే స్లూయిస్‌సిల్ +౪౯౦.౦౦ యం. యస్. యల్. వద్ద ఈ కాలువ గుంటూరు, నెల్లూరు జిల్లాల పడమటి సరిహద్దు దిగువ నేలగుండా ౨౩౬ మైళ్లు ప్రవహించి, సోమశిల దాటిన తరువాత మైలున్నరదూరంలో పెన్నా నదిలో కలుస్తుంది. దీనివల్ల లాభంపొందే ప్రాంతాలు గుంటూరు జిల్లాలో పల్నాడు, వినుకొండ, నర్సా

రావుపేట, ఒంగోలు, సత్తెనపల్లి, గుంటూరు తాలూకాలలోను, కర్నూలు జిల్లాలో మార్కాపురం తాలూకాలోను, నెల్లూరు జిల్లాలో దర్శి, పొదిలి, కావలి, కందుకూరు, ఉదయగిరి, ఆత్మకూరు నెల్లూరు తాలూకాలలోను ఉంటవి. పూర్తిపథకం క్రింద ఈ కాలువ ఆయకట్టు ౧౮.౫౮ లక్షల ఎకరాలుంటుంది.

## ఎడమ ప్రక్క కాలువ

ఇది హెడ్‌స్లూయిస్ (సిల్ + ౪౯౦) నుండి ౧౫,౩౦౦ అడుగుల పొడవైన సొరంగం ద్వారా బయలుదేరుతుంది. ప్రారంభంలో ౧౨,౦౦౦ క్యూజెక్కుల నీటితో ఈ కాలువ హైదరాబాదు సరిహద్దు వరకు, కట్టలేరు వరకు ప్రవహిస్తుంది. తర్వాత ఆంధ్ర రాష్ట్రంలో దీన్ని పొడిగిస్తారు. దీనివల్ల నీటి సరఫరా పొందే ప్రాంతాలు హైదరాబాదులోని నల్లగొండ, ఖమ్మంజిల్లాలలోను, ఆంధ్రలో కృష్ణా జిల్లాలో నందిగామ, తిరువూరు, నూజివీడు గన్నవరం తాలూకాలలోను వుంటవి. ఆయకట్టు హైదరాబాదు రాష్ట్రంలో ౭.౯౫ లక్షల ఎకరాలు, ఆంధ్రలో తమ్మిలేరు వరకు సుమారు ౪.౨౪ లక్షల ఎకరాలు.

ఈ ప్రాజెక్టు కృష్ణాడెల్టాలో ఇప్పుడు నీటిసరఫరా పొందుతూ వున్న ౧౦.౫ లక్షల ఎకరాల భూమికి నీటికొరత లేకుండా చెయ్యటమే కాక కొత్తగా కాలువల క్రిందికి తెచ్చేభూమి మొదటి పైరు ౧.౫ లక్షల ఎకరాలు, రెండవ పైరు ౧.౫ లక్షల ఎకరాలు, సర్వదా పండేపైరు ౦.౨౫ లక్షల ఎకరాలు, మొత్తం మీద ౩౪.౦౨ లక్షల ఎకరాలకు నీటిసరఫరా జరుగుతుందన్నమాట. ఇది ప్రస్తుతం కృష్ణా గోదావరి డెల్టాలలో వున్న ఆయకట్టుకు ఒకటిన్నర రెట్లు.

## విద్యుచ్ఛక్తి ఉత్పత్తి

డాము క్రింద పొలాలకోసం వదిలే జలపాతం నుండి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేస్తారు. ౬౦ శాతం లోడ్‌మీద సర్వదా ఉత్పన్నమయ్యే శక్తి ౭౫,౦౦౦ కిలోవాట్లు. ఇది గాక వర్షాకాలంలో అదనంగా డాము వద్ద విద్యుచ్ఛక్తి తయారు చేయవచ్చు.

## నిర్మాణ కార్యక్రమం

ఈ పని అంతా రెండు అంచెలుగా జరుగుతుంది.

మొదట కట్టబడేవి :

నాగార్జున సాగర్ డాము యఫ్. ఆర్. యల్. + ౫౨౫.౦౦ వరకు (పూర్తి యఫ్. ఆర్. యల్. + ౫౯౦.౦౦ ఉంటుంది.)

కుడిప్రక్క కాలువ మూసీ నదివరకు ఎడమప్రక్క కాలువ మునేరువరకు ఉంటాయి. మొదటినిర్మాణానికి ౭౫.౦౮ కోట్లు ఖర్చు అవుతుంది. దీనివల్ల ౧౯.౧ లక్షల యకరాలకు నీటిసరఫరా జరుగుతుంది. ఇందులో కుడిప్రక్క కాలువక్రింద ౯.౭ లక్షల యకరాలు, ఎడమ ప్రక్కకాలువ క్రింద ౭.౯ లక్షల యకరాలు, అదనంగా కృష్ణా డెల్టాలో ౧.౫ లక్షల ఎకరాలు ఉంటవి.

రెండవ అంచెలో డామును ఎఫ్. అర్. యల్. +౫౯౦.౦౦ వరకు కట్టడం, రెండుకాలువలూ పూర్తిగా త్రవ్వడం జరుగుతుంది.

## కంట్రోలు బోర్డు

ఈ ప్రాజెక్టును సత్వరంగా మితవ్యయంతో పూర్తి చెయ్యడానికి ఒక కంట్రోలు బోర్డు ఏర్పాటయింది. దీనిలో రెండురాష్ట్రాల ప్రతినిధులు, కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులు ఉన్నారు.

ఆంధ్ర హైదరాబాదు రాష్ట్రాల చీఫ్ ఇంజనీర్లు డాముకొరకు నియమించబడిన చీఫ్ ఇంజనీరు ఈ ప్రాజెక్టును నిర్మిస్తారు. ఎడమ ప్రక్కకాలువ హైద్రాబాదు ప్రభుత్వం తమ సరిహద్దుల వరకు పూర్తి చేస్తుంది. ఆంధ్ర ప్రభుత్వంవారు దీనిలో కృష్ణా జిల్లాలో ప్రవహించే భాగాన్ని, కుడివైపు కాలువను పూర్తిగాను నిర్మిస్తారు.

## నాగార్జునుడు

జలాశయ నామకరణానికి మూలపురుషుడైన నాగార్జునాచార్యుడు మహాయాన బౌద్ధానికి సంస్థాపకుడు. ఈయన కాక మరొక నాగార్జునుడుకూడా వుండేవాడు. వీరి జీవిత వివరాలు కేటాయించి, వీరు వీరూ అని నిరూపించడానికి తగినంత చారిత్రక సామగ్రి ఇంకా లభించలేదు. నాగార్జునుల జీవిత విశేషాలన్నీ చీనా, టిబెట్టు దేశాల వాఙ్మయాలలో ఆదేశభాషలలో వున్నవి. తెలిసినంతవరకు వీరు సమకాలికులు మాత్రం కారు. రెండు మూడు శతాబ్దాలయినా వ్యత్యాసం కలవారు. కానైతే ఇద్దరూ కూడా తమ చరమ జీవితాలు శ్రీ పర్వత ప్రాంతంలోనే గడిపినట్లు చీనా టిబెట్టు దేశపు సంప్రదాయంవల్ల తెలుస్తుంది. ఆ శ్రీపర్వతమే నాగార్జునకొండ అని చరిత్రకారులు, శాస్త్రవేత్తలూ నిర్ణయించినారు. ఇత్సింగ్ అనే చీనా యాత్రికుడు భారతదేశంలో కొన్నాళ్లుపుండి, నలందా విశ్వవిద్యాలయంలో ౬౭౫-౮౫ క్రీ. వె. అధ్యాపకుడుగా వుండిన నాగార్జునుడి సంగతి వ్రాసినాడు. అతని ప్రకారం ఆదినాగార్జునుడు క్రీ. వె. ఒకటవ శతాబ్దంలో జీవించివున్నాడు. ఆయన కనిష్క చక్రవర్తి సమకాలికుడు. చీనా సాంప్రదాయంలో నాగార్జునుని పేరు లుంగ్ మింగ్ లేక లుంగ్‌షూ. టిబెట్టు సంప్రదాయం ప్రకారం నాగార్జునుడు విదర్భబ్రాహ్మణుడు. వేద వేదాంగాలలో ఆరితేరి, బౌద్ధమతం అవలంబించి, నలందా విశ్వవిద్యాలయంలో ప్రధానాచార్యుడైనాడు. బుద్ధగయవద్ద నదిలో వరదలు వచ్చి నష్టం కలుగుతూవుంటే, ఈయన నదికి అడ్డంగా కళింగుల కట్టినట్టు ఒకప్రతీతి.



*బాలలు వేసే పూలమాలలు స్వీకరిస్తూ తిరిగి వారికి మాలలు వేస్తూవున్న ప్రధాని.*

నాగార్జునాచార్యుడు శ్రీపర్వతం మీద నివాసంగా వున్న కాలంలోనే ఆ నగరం ఆసియా ఖండపు విజ్ఞాన కేంద్రంగా విలసిల్లినది. మహాయాన బౌద్ధానికి మహా పీఠమైనది. అటుతర్వాతనే మహాయానం టిబెట్టు, చీనా, మంగోలియా, కొరియా, జపాను దేశాలకు ప్రాకినది. తత్కారణంగానే నాగార్జునుడి జీవిత విశేషాలు టిబెట్టు, చీనా దేశాలలో నిల్చినవి.

## నాగార్జున కొండ

నాగార్జునకొండ పూర్వనామం విజయపురి. ఈ విజయపురి ఇక్ష్వాకు వంశపురాజుల ముఖ్యనగరం. విజయపురి ఇక్ష్వాకులు, పూర్వ ఇక్ష్వాకుల వంశస్థులమని చెప్పుకునేవారట. ఈ దక్షిణ ఇక్ష్వాకు రాజవంశపు మూలపురుషుడు ఒకటవ శాంతమూల. వీరు వైదిక మతస్థులు. అయినప్పటికీ వీరి రాణివాసపు స్త్రీలు మాత్రం బౌద్ధమత పక్షపాతులు; పోషకులు. ఈ స్త్రీలు నాగార్జున కొండలో అనేక చైత్య, విహార, సంఘారామాల నిర్మాణానికి దోహదంచేసి చరితార్థులైనారు.

శిథిలమైపోయి, భూగర్భంలో ఇమిడివున్న నాగార్జునకొండ క్రీ. శ. ౧౯౨౬ లో బైటపడినది. చిట్టడివితో నిండిన ఈ ప్రదేశంలో గుట్టలూ దిబ్బలూ చాలా ఉన్నవి. ఈ దిబ్బలన్నీ ఒకనాడు మహాచైత్యాలో, విహారాలో అయినట్టు త్రవ్వగా తెలియవస్తున్నది. ఒక చోట రాజభవన శిధిలాలు కనబడినవి. ఒక మహా చైత్యమూ, ఎనిమిది చిన్న స్తూపాలు, నాలుగు విహారాలు, నాలుగు మండపాలు బైటపడినవి. నాణెములు, రాతి విగ్రహాలు క్రీ. శ. రెండు మూడు శతాబ్దాలకు చెందిన ఇక్ష్వాకు శాసనాలు, సుందర శిల్పాలతో కూడిన కొన్ని పంచల శిలాఫలకములూ దొరికినవి. మహా చైత్యంలో ఒక 'ధాతుపేటిక' లభించినది. ఈ ధాతువు బుద్ధదేవుడిదేనని అనుకుంటున్నారు. అది ప్రస్తుతం కాశీసమీపంలో బుద్ధుడు తొలిసారిసందేశమిచ్చిన సారనాథ్‌లో మూలగంధకుడి విహారంలో భద్రంగా ఉన్నది. నాగార్జునకొండలో పూర్వం విశ్వవిద్యాలయం ఉన్న ప్రదేశం కూడా ఒకటి బయటపడింది.

సుప్రసిద్ధ చీనాయాత్రికుడు హ్యూన్‌సియాంగ్ క్రీ. శ. ౬౩౦-౪౪ ప్రాంతంలో మనదేశంలో సంచారం చేస్తూ నాగార్జునకొండ సందర్శించినాడు. అతని భారత దేశయాత్ర కధనంలో తననాటి శ్రీపర్వతం వర్ణించినాడు. ఆ కాలంలో ఇంకా నాగార్జునకొండలో బౌద్ధ సంఘారామాలూ, అందులో ముఖ్యంగా నాగార్జునాచార్యుడి కోసం శాతవాహన ప్రభువొకడు నిర్మించిన ప్రత్యేక సంఘారామం మంచి దశలోనే ఉన్నట్లు తెలుస్తుంది. హ్యూన్‌సియాంగ్ వ్రాసిన ప్రకారం నాగార్జున సంఘారామం శ్రీపర్వతంలో కందరంలా తొలిచినారు. అయిదారంతస్థుల ఉన్నత ప్రాసాదం వలె ఉండేది. పచారుచెయ్యడానికి పంచపాళీలతో రాతిఫలకాలతో నిర్మించిన వసారాలతో, ప్రతి అంతస్థులోనూ నాలుగేసి మహాలయా విహారాలూ ఉండేవి. ప్రతి విహారంలోను బంగారంతో పోత పోసిన నిలువెత్తు బుద్ధవిగ్రహా లుండేవి. ఆ విగ్రహాల మీద చెక్కడపు పని అతిలోక సౌందర్యంగా ఉండేది. ఇంతవరకు జరిగిన త్రవ్వకాలతో ఆ సంఘారామం ఇంకా బయట పడలేదు.

నాగార్జునకొండలో బయటపడ్డ నిర్మాణాల వాస్తువు అమరావతి కళని పోలివుంటుంది. మహాచైత్యం మహోన్నత ప్రదేశం మీద ఉండేది. దానికి దారి మెట్టుపై మెట్టుగా ఉండేది. ఒక పక్కనుంచి మరో పక్కకి చైత్యం ౧౦౬ అడుగులు. ఎత్తు డెబ్బైఎనభై అడుగులు. వలయాకారమయిన స్తూపశిఖరోపరి భాగం మీద చక్కని చలువరాతి చెక్కడాలు, అపురూపమయిన శిల్పసంపద, బుద్ధజీవితం, బుద్ధజాతకాలు చిత్రించిన ఈ శిల్పసంపద దొరికినంతవరకు చాలా మంచి స్థితిలో ఉన్నది. క్రీస్తు శకారంభంలో కృష్ణాతీర చరిత్ర పరిశోధించి తెలుసుకునేందుకూ, ముఖ్యంగా మహాయాన బౌద్ధమత పరిణామం తెలుసుకునేందుకూ ఈ శిలాఫలకాలూ, శాసనాలూ పనికి వస్తవి. నదికి దిగువలోవున్న అమరావతిలో వలెనే ఇక్కడ కూడా మంచున్న బుద్ధ విగ్రహాలు బయట పడినవి. తత్కారణంగా అమరావతి నాగరికత దేశ



డాము స్థలానికి హైదరాబాదు వైపున ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ, ఆంధ్ర గవర్నరు శ్రీ సి. యం. త్రివేది, శ్రీమతి త్రివేది, హైదరాబాదు ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణారావు, తదితర ప్రముఖులు.

వ్యాప్తం అయే రోజులలోనే నాగార్జునకొండ కూడా విరాజిల్లినదని తేటపడుతుంది.

### కృష్ణవేణి

గంగా గోదావరీ నదులతోపాటు కృష్ణకూడా భారత దేశపు పుణ్యనదులలో ఒకటి. కృష్ణాతీరం అనాది నించీ మానవనాగరికతకీ, ఆధ్యాత్మిక వైజ్ఞానికోద్యమాలకీ ఆటపట్టు. అనేక పుణ్యక్షేత్రాలు కృష్ణాతీరాన, ఉపనదుల తీరాలనా వెలసినవి. జన్మస్థానమైన పడమటి కనుమలలో మహాబలేశ్వరం మొదలు సాగర సంగమం వరకూ ఈ నదిపొడవు ౭౭౫ మైళ్ళు. శాఖోపశాఖలైన ఉపనదులతో దక్షిణాపథాన ౯౭,౦౦౦ చదరపు మైళ్ళ వైశాల్యంగల భూభాగంలోవున్న జలప్రవాహమంతా స్వీకరిస్తుంది. మహాబలేశ్వరం నించి తూర్పు దిక్కుగా ప్రవహించి సతారానగరం దగ్గిర కృష్ణ, వేణీనదిలో కలుస్తుంది. ఆ సంగంనించే ఈమెకు కృష్ణవేణి అనే నామం సార్థకమయినది. ఎత్తయిన పీఠభూమిలో ప్రవహించి, హైదరాబాదు రాజ్యం చేరగానే కృష్ణవేణి షోలాపూరు రాయచూరు దోవాబులలో కిందికి దూకుతుంది. షోలాపూరు దోవాబు కృష్ణా భీమా నదుల సంగంవల్ల ఏర్పడినది. భీమానది, పూనాజిల్లో సహ్యాద్రిమీద భీమాశంకర్ అనే క్షేత్రంలో ఉత్పత్తి అవుతుంది. శ్రీ దత్తాత్రేయ క్షేత్రమైన గాణ్గాపురంవద్ద కృష్ణలో కలుస్తుంది.

రాయచూరు దోవాబు కృష్ణా తుంగభద్రా నదుల సంగమంవల్ల ఏర్పడినది. తుంగా భద్రానదులు కలిస్తే

తుంగభద్ర అయినది. మైసూరు రాజ్యంలో కడూరు జిల్లాలో వరాహపర్వత ప్రాంతంలో, గంగమూల వద్ద జన్మించిన ఈ అక్కచెల్లెండ్రలో తుంగమ్మ శృంగేరి సమీపంగా ప్రవహించి, భద్రమ్మతో కలిసి, తుంగభద్రమ్మగా వెలసి, పునీతమైన హరిహర, విజయనగర సామ్రాజ్య సీమ హంపీ. ఆనెగొంది, అలంపురం మీదుగా నడిచి కృష్ణలో కలుస్తుంది.

ఇన్ని శాఖలతో మహా ప్రవాహంగా రూపొందిన కృష్ణవేణి, పాతాళగంగ నామాంతరంతో శ్రీశైల మల్లికార్జునస్వామి పాదస్పర్శచేసి, తూరుపు కనుమలలో, నల్లమలకొండలోయలోచొచ్చుకుని మల్లయ్య కొండవద్ద ఒక సుందర ప్రదేశంలో ప్రవేశిస్తుంది. అక్కడ నదికి కుడివైపున నాగార్జునకొండ, ఎడమ వైపున ఏలేశ్వరం వెలసినవి. పద్దెనిమిది వందల సంవత్సరాల క్రితం దేశదేశాలనించి యాత్రికులతో, విద్యార్థులతో, సరుకుతో వచ్చిపోయే నావలు లంగరేసి నిల్చిన రేవు కట్టడం శిథిలా లింకా నిలిచి ఉన్నవి. ఏలేశ్వరం విడిచి కృష్ణ నందికొండ గ్రామ సమీపంగా ప్రవహిస్తుంది, నందికొండకి దిగువ ఒకటిన్నర మైళ్ళలోనే నాగార్జున సాగరం డాము నిర్మాణం అవుతుంది. ఆ ప్రాంతం విడిచి, తూరుపు దిక్కుగా వెళ్ళి, కృష్ణవేణి పవిత్రమయిన ఉత్తర వాహినిగా ముక్త్యాల ముందుగా నడిచి, ఆంధ్రసామ్రాజ్య ముఖ్యనగరమూ, విఖ్యాత బౌద్ధ విశ్వవిద్యాలయ స్థానమూ అయిన ధాన్యకటక అమరావతి ప్రాంతంలో ప్రవహించి, విజయవాటిక చేరుకుంటుంది. కృష్ణవేణమ్మ కనక దుర్గమ్మను సేవించిన విజయవాడవద్దనే సరిగా నూరు సంవత్సరాల క్రితం సర్ ఆర్థర్ కాటన్ ఆనకట్ట నిర్మించినాడు. అక్కడినుంచి తూర్పుగా నలభైమైళ్లు కిందికి పోయి బంగాళాఖాతంలో కలుస్తుంది. గ్రీసు దేశచరిత్రలో కృష్ణానది ప్రసక్తి ఉన్నది. ఆదేశపు భూగోళ శాస్త్రజ్ఞుడు టాలెమీ కృష్ణానదిని 'మైసోలస్' అనే నామంతో వర్ణించినాడు. తద్భవమే నేటి 'మసులీపట్నం.' క్రీస్తుశకారంభంలో కృష్ణానదిలో నాగార్జున కొండ వరకూ నావలు నడిచిన తార్కాణ ఉన్నది. అందువల్లనే కృష్ణాతీరాన వాణిజ్య క్షేత్రాల సమీపంలో నిర్మించిన బౌద్ధ క్షేత్రాలు వెలసినవి.

## నాగార్జునసాగర్ ఆయకట్టు స్థిరీకరణ కార్యక్రమం

రాష్ట్ర అభివృద్ధి మండలి సమావేశం ౧౯౫౫ డిసెంబరు ౭ వ తేదీన జరిగింది. ఈ సమావేశంలో నాగార్జున సాగర్ ప్రాజెక్టుక్రింద భూములను స్వాధీన పరచుకోవడానికీ, ఆయకట్టు నిర్ణయ సమస్యల పరిష్కారానికీ సంబంధించిన పథకంపై తుది నిర్ణయాలు చేయబడినవి.

నాగార్జున సాగర్ ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభమయిన లగాయతు నాలుగవ సంవత్సరంనుంచే వ్యవసాయానికి నీటి సరఫరా చేయబడుతుంది. గనుక ఆయకట్టుకు సంబంధించిన పని అంతా మూడేండ్లలోగా పూర్తి కావలసి వుంటుంది.

ప్రాజెక్టు నిర్మాణంలో పనిచేసే ఉద్యోగుల నివాస గృహాలకొరకు, రోడ్లకొరకు, ప్రాజెక్టునీరు విస్తరించి వుండే ప్రదేశం కొరకు, కాలువలకొరకు, ఆ కాలువలనుంచి త్రవ్వే పంటకాలువల నిర్మాణానికి భూములు స్వాధీన పరచుకోబడుతాయి.

నాగార్జునసాగర్ రిజర్వాయర్ లో ౨౭ గ్రామాలు మునిగిపోతవి. కనుక ఈ గ్రామాలకు సంబంధించిన భూములూ, ఇండ్లూ స్వాధీన పరచుకోబడుతాయి. ఆ గ్రామస్థులకు ఇతర ప్రాంతాలలో పునరావాసం కల్పించడానికి తగు చర్యలు గైకొనవలసి వున్నది. ప్రాజెక్టునుంచి వచ్చే ౧౪౦ మైళ్ళ పొడవుకాలువకూ, ఆ కాలువనుంచి త్రవ్వబడే పంటకాలువకూ అవసరమైన భూములను స్వాధీనపరచుకోవలసి వున్నది. ఈపనినంతటినీ త్వరగా ముగించడానికై అభివృద్ధి మండలి అవసరమైన సిబ్బంది నియామకానికి మంజూరీ ఇచ్చింది.

ఈ రాష్ట్రంలో నాగార్జునసాగర్ ప్రాజెక్టు క్రింద ౧౦ లక్షల ౪౫ వేల ఎకరాల ఆయకట్టు సాగు అవుతుందని అంచనా. ఈ ఆయకట్టు వద్ద పి. డబ్ల్యు. డి. సర్వేపని మాత్రం ఇంత వరకు పూర్తి అయింది.

(తరువాయి 15 వ పేజీలో)

> ప్రణాళిక అమలు జరగడానికి డబ్బు పెద్ద సమస్యకాదు, అర్హులైన పనివారలు దొరకడం పెద్ద సమస్య అవుతుంది....

# పంచవర్షప్రణాళిక ఉద్యోగులు

శ్రీ పి. వి. ఆర్. రావు, ఐ. సి. యస్.
హైదరాబాద్ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి.



దేశంలో లభించే సంపదనంతటినీ ఒక క్రమం ప్రకారం వినియోగించుకోవడానికే ప్రణాళికా రచన ఉద్దేశింపబడింది. అలా వినియోగించుకున్నప్పుడే మనం నిర్ణయించుకొన్న లక్ష్యాలు సాధ్యమై దేశ శ్రేయస్సు సమకూరుతుంది. ప్రథమ పంచవర్షప్రణాళిక తయారు చేయబడినప్పుడూ, అంతకుపూర్వం శ్రీ జె. ఆర్. డి. టాటా నాయకత్వాన కొందరు పారిశ్రామిక ప్రముఖులు యుద్ధానంతరం దేశాభివృద్ధి కొరకై మొదటి సారిగా ఒక ప్రణాళికను సిద్ధం చేసినప్పుడూ ఈదేశమంతా ఆ ప్రణాళికను చూచి నివ్వెరపోయింది. కారణ మేమంటే అవి అంతటి భారీ ప్రణాళికలు. ఎంతో ధైర్యం వుంటేనేగాని అటువంటి ప్రణాళికలు ఊహించడం, రచించడం సాధ్యంకాదు. పారిశ్రామిక ప్రముఖులు తయారుచేసిన ప్రణాళికకంటె మన ప్రథమ పంచవర్షప్రణాళిక దాదాపు రెండున్నరరెట్లు పెద్దది. ఇటువంటి ప్రణాళికలను అమలు పరచాలంటే దేశంలో తగినంత డబ్బు లభిస్తుందా అని చాలా మంది అభిజ్ఞులు సంకోచం వెలిబుచ్చారు. మనుషులూ సాధనసామగ్రిమాత్రం దొరకుతాయా అని కూడా సందేహించారు. అయితే ముఖ్యంగా డబ్బువిషయంలో కలత చెందారు. అసలు అంతడబ్బు ఎక్కడినుంచి తేవడం అనేది అందిరినీ ఎదుర్కొన్న ప్రశ్న ఆ రోజుల్లో – కాని గత ఐదేండ్ల అనుభవాన్ని బట్టి చూచినట్లయితే పరిస్థితి అందుకు భిన్నంగా కన్పిస్తుంది. ప్రణాళికలో చేర్చబడిన ఏ పథకాన్ని అమలు జరపడానికైనా డబ్బు ఎన్నడూ ఒక ప్రతిబంధకం కాలేదు. ఒక వేళ ఏమైనా ప్రతిబంధకాలు కలిగాయంటే అవి రెండు: ౧. యంత్రసామగ్రి, ౨. అర్హులైన ఉద్యోగుల కొరత.

ప్రథమ పంచవర్ష ప్రణాళికకు రూ. ౨,౨౫౦కోట్ల ఖర్చు అంచెనా వేయబడింది. రెండవ పంచవర్షప్రణాళికకు (ఇది ఇప్పుడు తయారు చేయబడుతున్నది–) రూ. ౪,౮౦౦ కోట్ల ఖర్చు అంచెనా వేయబడింది. రెండవ ప్రణాళిక ఖర్చు విషయంలోకూడా తగినంత డబ్బు లభిస్తుందా అని చాలా మంది సందేహాలు వెలిబుచ్చారు. కాని డబ్బుమాట ఎలావున్నా అర్హులయిన ఉద్యోగులు లభించరని నా భయం. ఎంచేతనంటే అటువంటివారి కొరత దాగా వున్నది. కనుక ఈ విషయంలో శ్రద్ధవహించాలి.

## మొదటి అవసరం

ఏ స్కీమును విజయవంతంగా అమలు జరపాలన్నా కొన్నికొన్ని వృత్తులలో ప్రవీణులయిన ఉద్యోగులు కావాలి. ఇది మొదటి అవసరం. ప్రావీణ్యమంటే సాధారణ ప్రావీణ్యం కావచ్చు లేదా ఎన్నో సమర్థతలు కూడిన ప్రావీణ్యంకావచ్చు. అటువంటి సమర్థతలు అన్నీ కూడాలంటే ఎంతో కాలంకూడా పట్టవచ్చు. ఈ సాంకేతిక నిపుణులేకాక, పరిపాలనా

వ్యవస్థ సమస్యకూడా వున్నది. ఈ సమస్య ద్విముఖ మైనది. మొదటిది శాంతిభద్రతలను పరిపోషించి పరిపాలనకు సంబంధించిన దైనందిన సమస్యలను పరిష్కారం చేయడం. ఇదేమంత గొప్పవిషయం? మామూలు పనే అని కొందరనుకోవచ్చు. ఈజిప్టు నుంచి జపానువరకు - ఆ మాటకొస్తే ఇంగ్లీషు ఛానల్ నుంచి పసిఫిక్ సముద్రం వరకు - ౧౯౪౭ సంవత్సరం నుండీ సువ్యవస్థితమైన ప్రజాస్వామిక పరిపాలన గలదేశం భారతదేశం ఒక్కటే. ఈవిషయాన్ని మనలో ఎంతమంది గ్రహించారో నాకు తెలియదు. కాని ఇది వాస్తవం. అభివృద్ధి ప్రణాళికలు విజయవంతంగా క్రమబద్ధంగా అమలు జరుగాలంటే దేశంలో సువ్యవస్థితమైన పరిపాలన మొదటి అవసరం. కనుక ఏ ప్రణాళిక అయినా ఈ అవసరాన్ని నిర్లక్ష్యం చేయకూడదు. పైగా సాధారణ పరిపాలన యంత్రాంగ నిర్వహణకూ, ఇంకా అవసరమైతే అంతకంటే పెద్ద బాధ్యతలనిర్వహణకూ ప్రణాళిక అవకాశం కలిగించాలి. ప్రణాళికకు సంబంధించినంతవరకు పరిపాలనయొక్క రెండవ అంశం గణిక ప్రావీణ్యత. ముఖ్యంగా హైద్రాబాదు వాసులకు ఒక విషయం చెబితే చాలా ఆశ్చర్యపోతారు. దేశంలో నిరుద్యోగం పెరిగిపోతూ వుందని గత మూడేండ్ల నుంచీ పలువురు అంటూ వచ్చారు. కాని వాస్తవమేమంటే తగినట్టి మనుష్యులు లభించక పోవడంచేత ప్రథమ పంచవర్ష ప్రణాళిక అమలు జరుగడం కొన్నికొన్ని సందర్భాలలో కుంటుపడింది. హైదరాబాదు రాష్ట్రంలో కొన్ని ప్రత్యేక కారణాల చేత నిరుద్యోగ పరిస్థితి తీవ్రరూపం దాల్చింది. ఇతర రాష్ట్రాలలోకూడా పరిస్థితి ఇందుకు భిన్నంగా లేదు. ౧౯౫౨ సంవత్సరాంతంలోనో లేక ౧౯౫౩ సంవత్సరారంభంలోనో రాష్ట్ర ప్రభుత్వాలు విద్యావంతుల లోని నిరుద్యోగ సమస్యను గుర్తించాయి. అలా గుర్తించబట్టే ఈ సమస్యను పరిష్కరించడానికై ప్రథమ పంచవర్ష ప్రణాళికకు తోడుగా అదనంగా ౪౦ కోట్ల రూ.లు ఖర్చుఅయ్యే మరికొన్ని స్కీములు కూడా చేపట్టబడినవి. ఇటీవలనే భారత ప్రభుత్వ ఆర్థిక శాఖామంత్రి ఒక సందర్భంలో ప్రసంగిస్తూ ప్రథమ పంచవర్షప్రణాళిక కొన్ని లక్షల మందికి ఉద్యోగాలు కల్పించినప్పటికీ, ఆ ప్రణాళికా కాలం లోనే ఉద్యోగాలు వెదికేవారి సంఖ్య కూడా బాగా పెరిగిందని అన్నారు. కాబట్టి ఈనాడు మనకు మనుష్యుల కొరతయే ముఖ్యమైన సమస్యగా వున్నది. అంటే ఏపనికి తగినమనిషి ఆ పనికి సకాలంలో లభించాలి. అలా లభించక పొయ్యారంటే మనం క్లిష్టసమస్య నెదుర్కొన్నామన్నమాటే. దీనిని పరిష్కరించవలసినది పాలకవర్గమే.

## శిక్షణావశ్యకత

మొదటి ఆవశ్యకత శిక్షణ. అంటే పనికి తగినట్టి మనుష్యులను తయారుచేయడం. చాలా స్వల్ప పనులకుకూడా శిక్షణ అవసరం. గుమాస్తా ఉద్యోగులకు మనదేశంలో మనుషుల కొరత లేదు. అయినప్పటికీ గుమాస్తా ఉద్యోగానికికూడా కొంత శిక్షణ అవసరం. ఈనాడు హైదరాబాదు నగరంలో సైతం టైపిస్టుల కొరత వున్నది. మరి ఈ రోజుల్లో ఏ ఆధునిక కార్యాలయంలోనైనా టైపిస్టులేనిది పని గడవదు. ఇక కొంచెం నిపుణులైన పనివారల విషయం ఆలోచిద్దాం. అంటే అకౌంటెంట్లు, షార్టుహాండు టైపిస్టులు- ఈ ఉద్యోగాలైతే వున్నవి. కాని వీటికి తగిన మనుష్యులు మాత్రం లభించడం లేదు. ఇంతకంటె ప్రవీణులయిన పనివారల విషయం ఆలోచిస్తే ఆ పరిస్థితి ఇంకా చెడ్డగా వున్నది. తాపీ పనివారు, వడ్రింగులు తగినంతమంది లేరు. రాష్ట్ర పబ్లిక్ వర్క్సుశాఖకు ఓవర్‌సీర్లు దొరకడం కష్టంగా వున్నది.

యుద్ధం ముగిసిన తరువాత, ఆ పిమ్మటకొంత కాలం వరకు ఉన్నతస్థాయి సాంకేతికోద్యోగుల శిక్షణకు హెచ్చు ప్రాముఖ్యమివ్వబడింది. అయితే వారికి వలసిన శిక్షణ సౌకర్యాలు మనదేశంలో అప్పుడులేవు. అందుచేతనే కేంద్ర ప్రభుత్వం ఓవర్సీస్ స్కాలర్‌షిప్ స్కీము (విదేశాలలో విద్యా శిక్షణ పథకము)ను ప్రవేశపెట్టింది. రాష్ట్ర ప్రభుత్వాలుకూడా దీనికి తగువిధంగా సహకార మిచ్చాయి. ఈ స్కీము ననుస

రించి అనేకమంది అభ్యర్థులు శిక్షణకొరకై విదేశాలకు పంపబడినారు. ఇది చాలా కఠినమయిన మార్గమే. అయినా దీనివల్ల మనం అనుభవం పొందాము. ఆ అభ్యర్థులలో చాలా మంది విద్య ముగించుకొని ఇక్కడికి తిరిగివచ్చిన తరువాత పరిస్థితి మరొకవిధంగా తయారయింది. ఒకానొక ప్రత్యేకవృత్తిలో శిక్షణ పొంది అభ్యర్థులు ప్రవీణులై తిరిగి వచ్చారు. కాని ఏం లాభం? వారికి తగినట్టి ఉద్యోగాలు లభించలేదు. ప్రజలు చెల్లించిన పన్నుల మూలంగా వసూలయిన డబ్బును బోలెడు ఖర్చుచేసి ఈ విధంగా విదేశాలకు ఉన్నతవిద్యకై పంపించి తిరిగి వారు రాగానే వారికి తగు పనులు చూపించలేక పోవడం నిరర్థకమని ప్రజలు గుర్తించారు. ఈస్కీము వల్ల ప్రయోజనమేమిటని అడిగారు. విదేశాలలో పెద్ద యోగ్యతలు సంపాదించి ఎన్నో ఆశలతో స్వదేశానికి తిరిగివచ్చిన తరువాత అభ్యర్థులు చాలా నిరాశ చెందారు. వారిలో కొందరు మళ్లీ తాము శిక్షణ పొందినట్టి విదేశాలకేవెళ్లి ఈ నాటికీ అక్కడే పనిచేస్తున్నారు. ఇటువంటి ఉన్నత సాంకేతిక యోగ్యతలు గల అభ్యర్థులు దేశానికి అవసరమే. అయితే ఒక విషయం ముఖ్యంగా గ్రహించాలి. ఇల్లు కట్టాలంటే పైకప్పునుంచి పని మొదలు పెడితే ఎలా? ఏ నిర్మాణానికైనా ఒక నిర్మాత అంటూ ఉండాలి. లేకపోతే నిర్మాణం ప్రారంభం కాదు. ఇంజనీరు ఎంత అవసరమో నిపుణుడు, ఒకమాదిరి నిపుణులయిన పనివారలుకూడా అంతే అవసరం. అయితే ఈ విషయాలన్నీ మన ప్రణాళికను తయారుచేసిన వారికి తెలుసు. రెండవ పంచవర్షప్రణాళిక తయారుచేసే సందర్భంలో వివిధ దశలలో పనివారలకు శిక్షణసౌకర్యాలు ఏర్పాటు చేయవలసిన ఆవశ్యకత పూర్తిగా గుర్తించబడుతున్నది. అందు కవసరమయిన అవకాశాలుకూడా కల్పింపబడుతున్నవి. తులనాత్మకంగా తక్కువ గ్రేడులపై నిపుణులయిన పనివారలు — అంటే సబ్ ఓవర్‌సీర్లు, డ్రాఫ్ట్సుమెన్, మొదలగువారికి తగు శిక్షణ ఇచ్చి తర్ఫీదుచేసే కార్యక్రమానికి హెచ్చు ప్రాధాన్యమివ్వబడుతుంది.

## అధిక సౌకర్యాలు

ఈ సందర్భంలో మరికొన్ని వాస్తవాలను మొగమాటంలేకుండా చెప్పదలచుకున్నాను. విద్యాధికులు, ఏ కొంచెమైనా చదువుకున్న వాళ్లు మన దేశంలో ఒళ్ళు వంచి పనిచేయడాన్ని అదోమాదిరిగా తలుస్తారు. ఈ అభిప్రాయం ఇప్పుడు క్రమంగా సన్నగిల్లి పోతున్నది. అయితే అటువంటి భావాలింకా పూర్తిగా రూపుమాసిపోలేదు. ముఖ్యంగా తెల్లచొక్కాలు వేసుకొనే వర్గంవారిలో ఈ భావాలు అలాగే వున్నవి. నేనుకూడా ఆ తెల్లచొక్కాల వర్గం వాడినే. మరి అటువంటివాణ్ణి ఇతరులకు బోధచేయడమేమిటని మీరనుకోవచ్చు. కాని అదికాదు విషయం. మన వెనుకటి తరాలవారు తప్పుచేశారా ఒప్పుచేశారా అనే విషయంతో నిమిత్తం లేకుండా ఇప్పుడు మనం ఆలోచించ వలసిందేమిటి? భావి తరాలవారికి మనం ఏం చేస్తున్నాము. ఏమి చెయ్యాలి అనేది ముఖ్యమైన అంశం. భారత దేశంలో విద్యా సౌకర్యాలు క్రమేణా హెచ్చుతున్నవి. కొన్ని రాష్ట్రాలలో ప్రాథమిక విద్య ఇదివరకే నిర్బంధం చేయబడింది. ఇతర రాష్ట్రాలలో ఇంకా ప్రాథమిక విద్య నిర్బంధంగా ప్రవేశపెట్టబడక పోయినా ఇప్పటికి ఒకటి రెండు తరాల క్రితంకంటె ఇప్పుడే ఈ విద్యాసౌకర్యాలు ఎక్కువగా వున్నవని అంగీకరించక తప్పదు. అయితే చదవడం వ్రాయడం వచ్చి, కేవలం అక్షరాస్యులైనంత మాత్రాన ఏ ఆఫీసులోనో ఉద్యోగం కావాలని కోరడం, లేకపోతే సాంకేతిక సంబంధమయిన ఉద్యోగాలలో సబ్ ఓవర్‌సీర్ కావాలని కోరుకోవడం వల్ల మన ప్రణాళిక విజయవంతం కాదు. అలా కోరుకొన్నవారు తమకుతామే మేలు చేసుకొంటున్నామని భావించుకోవడం కూడా తప్పు. చదువను వ్రాయను వచ్చినవారు మేస్త్రీగానో ఇటుకపనివారుగానో, వడ్రంగిగానో పనిచేయకూడదని అనుకోవడం బూజుపట్టిన పాతభావాలనే నెమరు వేసుకోవడం వంటిదని మనవి చేస్తున్నాను. కాస్త చదువు వచ్చినంతమాత్రాన సూపర్వయిజర్ ఉద్యోగం తప్పితే అంతకు క్రింది ఉద్యోగం చేయకూడదని

అనుకోవడం కూడా పొరపాటు. మన దేశాభివృద్ధికి ప్రతిబంధకంగా నిల్చిన ముఖ్యమైన కారణాలలో నిపుణులైన పనివారలకు చదువు రాకపోవడం ఒకటని గ్రహించాలి. చదువు రాకపోవడంచేత అట్టి పనివారలు ఆధునికమైన అభివృద్ధి విధానాలవల్ల ఎంత మేలు పొందవచ్చునో అంతగా పొందలేక పోతున్నారు. నిపుణులైన పనివారలు కొంచెం చదువు నేర్చుకోగానే తమ వృత్తిని వదలుకోవడం మంచిదికాదు. అలాగాక ఆ చదువుతో వారు తమ వృత్తిని, తమ ప్రావీణ్యాన్ని ఇంకా పెంపొందించుకోవడానికి ప్రయత్నించాలి.

ఈ సమస్యలోనే ఆలోచించవలసింది మరొక అంశం కూడా ఉన్నది. ఒక ప్రణాళిక లేక ప్రణాళిక లోని ఒక స్కీముగాని పూర్తి అయినంత మాత్రం చేత లక్ష్యం సిద్ధించిందని అనుకోకూడదు. మన ప్రణాళికయొక్క ముఖ్యలక్ష్యం దేశంలో ప్రతి ఒక్కరికీ ఉద్యోగం, పని చూపడం. ఇప్పుడే నిరుద్యోగ పరిస్థితి తీవ్రంగా ఉన్నదని అంటున్నారు. జనాభా పెరిగిన కొద్దీ వచ్చే పంచవర్ష ప్రణాళిక కాలంలో అదనంగా ఒక కోటిమంది నిరుద్యోగులు తయారవుతారు. వీరంతా ఉద్యోగాలకొరకు ప్రయత్నిస్తూ ఉంటారు. రెండవ ప్రణాళికలో ౧ కోటి ౨౦ లక్షల మందికి ఉద్యోగాలు కల్పించవలసివున్నదని అభిజ్ఞులు అంటున్నారు. దేశంలో ఆర్థిక ప్రమాణాన్ని పెంపొందించడమే మన ప్రణాళిక లక్ష్యం కాబట్టి ఈ ఉద్యోగాలన్నీ నైపుణ్యం అవసరమైన ఉద్యోగాలే అయివుంటాయి. దీనినిబట్టి మన దేశంముందు ఇప్పు డెటువంటి సమస్య కలదో మీరు అర్థం చేసుకోవచ్చు.

## ఒక చిక్కు

అయితే ఇక్కడే మనం పెద్ద చిక్కు నెదుర్కోవలసి వస్తున్నది. దేశ సంపదను అభివృద్ధి పరచాలంటే భారీ పరిశ్రమలను సామాన్య పరిశ్రమలను త్వరగా నెలకొల్పాలి. ఇందుకు పెట్టుబడి కావాలి. ఇంత పెట్టుబడి పెట్టినా చాలా తక్కువ ఉద్యోగాలే లభిస్తాయి. కాబట్టి దీనివల్ల మన నిరుద్యోగ సమస్య తీరదు. ఈ విషయంలో గల భిన్నాభిప్రాయాలను సమన్వయ పరచడానికై కుటీర, స్వల్ప పరిశ్రమలను అభివృద్ధి పరిచే కార్యక్రమానికి ప్రాముఖ్య మివ్వాలని మన ప్రణాళికలో తలపెట్టబడింది. ఈ పరిశ్రమలు వినిమయ వస్తువులను తయారుచేస్తాయి.

రెండవ పంచవర్ష ప్రణాళిక తయారుచేయడం ఇంకా పూర్తికాలేదు. ఇది ఇప్పుడు రచింపబడుతున్నది. కొన్ని ప్రాజెక్టులలో శిక్షితులైన పనివారల అవశ్యకతవున్నది. కాబట్టి భారీ ప్రాజెక్టులలో వాటి నిర్మాణ కార్యక్రమంతో పాటు పనివారలకు శిక్షణ ఇవ్వడం కనీసం స్వల్పకాలిక శిక్షణ ఇవ్వడమైనా ముఖ్యాంశంగా ఏర్పాటుచేస్తే మేలు జరుగుతుంది.

ఇక హైద్రాబాదు విషయం పరిశీలిద్దాం. హైద్రాబాదు ముసాయిదా ప్రణాళికలో పంచవర్ష ప్రణాళిక కాలంలో అదనంగా ౧౨ లక్షల మందికి ఉద్యోగాలు కల్పించాలని తలపెట్టబడింది. భారతదేశం మొత్తంలో ఈ రాష్ట్ర జనాభా సూటికి ౫.౨ వంతులున్నది. కాబట్టి రాష్ట్రంలో అదనపు ఉద్యోగాలు కల్పించడానికై ప్రణాళికా కర్తలు తగు విధంగానే వ్యవహరించారని చెప్పాలి.

అభ్యర్థులకు శిక్షణ ఇవ్వడమే గాక శిక్షణ పొందిన వ్యక్తికి సాధ్యమైనంత త్వరగా ఉద్యోగం చూపించడం కూడా అవసరం. ఇప్పటికి పదేండ్ల క్రితం స్థాపించబడిన ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజి వ్యవస్థకు ఈ బాధ్యత అప్పగించబడింది. ఈ వ్యవస్థ మిగుల ప్రయోజనకరమైనదని సర్వత్రా గుర్తింపబడింది. ఇకనుంచి ఇది రాష్ట్ర పరిపాలనా యంత్రాంగంలో ఒక శాశ్వత అంతర్భాగంగా ఉంటుంది. అయితే ప్రభుత్వం, పారిశ్రామికులు, ప్రజలు పరస్పర సహకారంతో యీ యంత్రాంగాన్ని సాధ్యమైనంత ఎక్కువగా ఉపయోగించుకుంటేతప్ప, లేకపోతే దీనివల్ల కలుగవలసినంత లాభం కలుగదు. రోడ్లపై, బస్సుల వద్ద మనం చూస్తూనే ఉంటాము. కొన్నికొన్ని చోట్ల మనుష్యులు మూక ఉమ్మడిగా బస్సులో సీటుకోసం ఎగబడుతూ ఉంటారు. మరికొన్ని చోట్ల చక్కగా క్రమశిక్షణతో క్యూలో నిలబడి బస్సు ఎక్కుతూ ఉంటారు. మూక ఉమ్మడిగా ఎగబడి ఎక్కితే బల

వంతులకు మాత్రమే సీట్లు దొరుకుతాయి. ఇతరులకు దొరకవు. కనుక యావత్ప్రజల శ్రేయస్సు దృష్ట్యా క్యూ పద్ధతే ఉత్తమమైనది. ఇటువంటి క్యూ పద్ధతినే ఎంప్లాయిమెంటు ఎక్స్చేంజీ అనుసరిస్తుంది. మామూలు పద్ధతిలోనైతే సిఫారసులూ ప్రాబల్యమూ గలవారికే ఉద్యోగాలు లభిస్తాయి. కాని ఎక్స్చేంజీలుంటే అలా కాదు. కనుక దేశ శ్రేయస్సు దృష్ట్యా ఎంప్లాయి మెంటు ఎక్స్చేంజీలద్వారానే ఉద్యోగాలకు అభ్యర్థులను ఎన్నిక చేయడం మంచిది. ఈ ఎక్స్ఛేంజీల కొరకై ఒక శాశ్వత యంత్రాంగాన్ని ఏర్పాటుచేయాలని ఇప్పుడు అంతిమంగా నిర్ధారణ చేయబడింది. అది అమల్లోకి వస్తుంది. ఇక ఇప్పుడు ఆ యంత్రాంగాన్ని సక్రమంగా వినియోగించుకోవడం దేశం యొక్క కర్తవ్యం. ప్రజాస్వామిక దేశంలో ఈ విధానం చాలా అవసరం. ఈ ప్రపంచంలో ఇప్పటికీ కొందరు అక్రమమైన విధానాల ద్వారా ఉద్యోగాలు పొందుతూనే ఉన్నారు. కాని ప్రజాభిప్రాయం అందుకు ఎల్లప్పుడూ విరుద్ధంగానేవుంది. అటువంటి పద్ధతులు గర్హ్యణీయమైనవని అంతాఅంగీకరించారు. కనుకక్రమ బద్ధమైన విధానాన్నే ప్రజాస్వామ్యదేశం అనుసరిస్తుంది.

పంచవర్ష ప్రణాళికకు నిపుణులైన పనివారలను పొందే విషయంలో దేశం ఎదుర్కొనే ఇబ్బందులను మీ ముందుంచాను. రెండవ పంచవర్ష ప్రణాళికలో ఈ ఇబ్బందులను ఎదుర్కోవడానికై అవలంబించబడే చర్యలను కూడా మీకు నివేదించాను. తప్పు చేయడం మానవునికి సహజమైన విషయం. కాని ఆ తప్పును దిద్దుకోవడంలోనే అతడి ఘనత వ్యక్తమవుతుంది. ప్రణాళికకు సంబంధించిన సంఖ్యలను నేను ఏకరువు పెట్టలేదు. ఎంచేతనంటే కేవలం సంఖ్యలు ఎప్పుడూ విసిగిస్తూనే ఉంటాయి. అయితే సమస్యలను మీకు కొంతవరకైనా విశదీకరించి వాటికి పరిష్కార మార్గాలను నేను స్థూలంగానైనా సూచించి ఉన్నట్లయితే నాకు అదేచాలు.

( ఎ. ఐ. ఆర్. హైద్రాబాదు సౌజన్యంతో )

---

[ 10 వ పేజీ తరువాయి ]

## నాగార్జునసాగర్ ఆయకట్టు

ఇక పోతే ఈ ప్రాంతంలోని భూసారం, రెవిన్యూ, వ్యవసాయ సర్వేలు జరుగవలసి వున్నవి.

*ఈ పని అంతా ఇట్లా జరిపిస్తారు:* మొదట ఒక అసిస్టెంటు ఇంజనీరు, ఆయన సిబ్బంది ఈ ఆయకట్టు క్రిందికి వచ్చే ప్రతి గ్రామానికి వెళ్ళి క్రాస్ లెవెల్స్ తీసుకొని కట్టలకు గుర్తులు పెట్టుకొని, కాలువక్రిందికి వచ్చే ప్రాంతాన్ని చూపించునట్టి పటాన్ని తయారు చేస్తారు. ఆ పటం భూసార నిపుణునికి పంపబడుతుంది. ఆయన ఆ గ్రామాలకు వెళ్ళి పొలాలలోని మట్టిని తీసుకొని ఆ మట్టిసారం ఎలావున్నదీ పరిశీలించి, గ్రామంలోని వివిధరకముల భూములను, ఆభూములలో లాభకరంగా పండించదగు పైరులను పటములలో చూపెడుతాడు.

తరువాత ఆ పటం డిప్యూటీ కలెక్టరుకు పంపబడుతుంది. ఆయన ఆయాగ్రామాలు, వాటి ఇరుగు పొరుగు ప్రాంతాలలో ఏయే పైరులు వేయవలసినదీ మొదలగు విషయాలను పటంలో సూచిస్తూ తాత్కాలికంగా ఒక ఆయకట్టును రూపొందిస్తాడు. అంతేగాక ఏ గ్రామంలో ఎంతసాగు జరిగేది, ఏయే పంటలు పండించవలసినదీ మొదలగు పరిశీలనలు జరుపుతాడు. ఆ పరిశీలనల కవసరమగు సంఖ్యలను తదితర వివరాలనుకూడా సేకరిస్తాడు.

ఆయకట్టు యూనిట్సు అన్నీ ఒక ప్రత్యేక కలెక్టరు అజమాయిషీ క్రింద పని చేస్తవి. ఆ యూనిట్ల యొక్క సాంకేతిక కార్యములనన్నిటినీ వాటికి సంబంధించిన శాఖాధిపతులు తనిఖీచేస్తూ తగు సూచనలు ఇస్తూ వుంటారు.

ఆయకట్టుపథకం ౧౯౫౬ ఏప్రిల్ ౧ వ తేదీ నుంచి అమలు జరుగడం ఆరంభమవుతుంది. ఈ లోగా తుంగభద్ర ప్రాజెక్టు క్రింద ఇప్పుడు జరుగుతున్న ఆయకట్టు నిర్ణాయక కార్యక్రమంలో ఉద్యోగులకు శిక్షణ ఇవ్వబడుతున్నది.

# * పోలీసు శాఖ రవాణా వ్యవస్థ *

## తక్కువ ఖర్చుతో ఉత్తమమైన విడిభాగముల తయారీ

*మార్కెట్లో పది అణాలకు లభించే డిస్టిల్డ్ వాటర్ సీసా హైదరాబాదులోని పోలీసు రవాణా వ్యవస్థ కర్మాగారం తాలూకు ఎలక్ట్రికల్ విభాగంలో ఆరు పైసలకంటె తక్కువ ఖర్చుతోనే తయారు చేయబడుతున్నది. దీనినిబట్టి ఆ కర్మాగారం ఎంత లాభసాటిగా వున్నదో తెలుసుకోవచ్చు. ఆ కర్మాగారం పోలీసు శాఖయొక్క మోటారుబండ్ల నిర్వహణ భారాన్ని వహిస్తూ, వాటి చెడిపోయిన భాగాలను తీసివేసి క్రొత్త భాగాలను అమర్చుతూ ఎంతో ప్రయోజనకరంగా పని చేస్తున్నది. అందుచేతనే దీనిని విద్యార్థులకు శిక్షణ సౌకర్యాలు కలుగజేసే సాంకేతిక సంస్థగా ప్రభుత్వం పరిగణించింది.*

పోలీసు రవాణా వ్యవస్థకు నాలుగు డివిజను లున్నవి. ఈ నాలుగు డివిజనులను ఆ వ్యవస్థకు సంబంధించిన ప్రధాన కార్యాలయం కంట్రోలుచేసి వాటిలో జరిగే పనిని పర్యవేక్షిస్తూ వుంటుంది. మొదటి డివిజను మోటారు రవాణాకు సంబంధించినది. దీనికి ఒక ఇనస్పెక్టరు ఇన్‌చార్జీగా ఉన్నాడు. అతడు ఆ డివిజన్ తాలూకు ౬౨౧ మోటారు బండ్లను కనిపెట్టిచూస్తూ ఉంటాడు. ఈ డివిజనుకు నాలుగు ఉపవిభాగాలున్నవి. ౧. భారీబండ్లు, ౨. తేలికబండ్లు, ౩. పి. ఓ. యల్. విభాగం, ౪. సర్వీసింగ్ విభాగం, ఈ ఉపవిభాగాలకు సబ్ ఆఫీసర్లు అధ్వర్యం వహిస్తారు.

మోటారు రవాణా విభాగం పోలీసుశాఖ మోటారు బండ్లను నిర్వహిస్తూ, శాంతి భద్రతల పరిరక్షణకై జిల్లాలకూ, హైద్రాబాదు నగరానికి మోటారు బండ్లను పంపిణీచేస్తుంది. ఇందులో అనేక రికార్డులు, బండ్ల ఖాతా పుస్తకాలు, బండ్ల ప్రయాణపు దినసరి లెక్కలు, బండ్ల గ్యాలను మైళ్ళ లెక్కలు, లాగ్ పుస్తకాలు ఉంటాయి. ఒక్కొక్క జిల్లాకు అనుమతింపబడిన బండ్లన్నీ ఒక డి. యస్. పి. చార్జి క్రింద ఉంటాయి. అతడు నెలసరి నివేదికలను పంపుతూ ఉంటాడు. చిన్నచిన్న మరమ్మతులను చేయడానికై ప్రతి జిల్లాకు ఒక మెకానిక్ ఉంటాడు. పెద్ద మరమ్మతులకు, పాతబడిన విడిభాగాలను తీసి, క్రొత్త భాగాలను పెట్టడానికి బండ్లు కేంద్రంలోని కర్మాగారానికి పంపబడుతాయి. మరమ్మతుల కొచ్చే బండ్లను కర్మాగారానికి పంపేముందు వెహికల్ పార్కు (బండ్ల స్థావరం) ఇన్‌చార్జీ ఉద్యోగి వాటిని తనిఖీ చేస్తాడు. మరమ్మతు జరిగిన తరువాత మళ్ళీ అతను బండ్లను వాపసు తీసుకుంటాడు.

నగరంలోని బండ్లు ప్రతినెల తనిఖీ కొరకై కేంద్రానికి తేబడుతాయి. మొదటి మరియు రెండవ పర్యాయపు మరమ్మతులు (అంటే చిన్న మరమ్మతులు) రనింగ్ రిపేర్లు యం. టి. విభాగంలో జరుపబడుతాయి.

ఫోర్స్డ్ లూబ్రికేషన్ కొరకై ఆధునిక పద్ధతులపై ఒక ఎలక్ట్రిక్ హైడ్రోలిక్ హాయిస్ట్ నెలకొల్పబడింది. దీనికి పవర్ స్ప్రే కూడా కలదు. వివిధ కార్యాలయాలకూ డ్యూటీ బండ్లకూ ఒక క్రమం ప్రకారం సరిగా పెట్రోలు ఇవ్వడానికీ, పెట్రోలు వినియోగాన్ని కనిపెట్టి ఉండడానికి వెహికల్ పార్కులో ఒక పెట్రోల్ పంపు నెలకొల్పబడింది. ఇది పెట్రోలును



*పోలీసు రవాణా వ్యవస్థకు చెందిన మోటారు బండ్లు.*

నిలువచేస్తుంది. రవాణా విభాగంలో విద్యుచ్ఛక్తితో నడుపబడే ఎయిర్ ఇన్‌ఫ్లేటింగ్ గేజి కూడా నెల కొల్పబడింది.

## కర్మాగారం

రెండవ డివిజన్ కర్మాగారం- ఇది ఒక వర్క్సు మేనేజరుచే కంట్రోలు చేయబడుతుంది. ఈ ఉద్యోగి దీనిని సమర్థవంతంగా నిర్వహించడమే గాక సాంకేతికోద్యోగుల శ్రేయస్సును కూడా చూస్తూ ఉంటాడు. కర్మాగారం ఐదు గ్రూపులుగా పనిచేస్తుంది. ఒక్కొక్క గ్రూపుకు ఒక సూపర్వైయిజరీ అధికారి ఉంటాడు. మొదటి గ్రూపు ఇంజన్ సెక్షన్, ఇంజనులు పూర్తిగా విడదీసి శుభ్రపరచి, పరీక్షించి మరమ్మతు చేయబడుతాయి. అన్ని విడిభాగాలకు ఎలక్ట్రిక్ డిగ్రీజింగ్ ట్యాంకుతో డిగ్రీజు చేయబడుతుంది. పాతభాగాలను తీసి క్రొత్త విడిభాగాలు అమర్చడం అవసరమైతే ఆ క్రొత్తభాగాలు స్టోర్సునుంచి తెప్పించబడుతాయి. ఇంజన్ను తిరిగి ఒకటిగా కూర్చిన తరువాత దానిని విద్యుచ్ఛక్తితో నడుపబడే ప్రత్యేకమైన రన్నింగ్ బెడ్‌పై పరీక్ష చేయడమవుతుంది. అప్పుడు ఇంజను తన సొంతశక్తితో నడువడమేగాక, అది లోడ్ పరీక్ష చేసే బెంచిపై కూడా తనిఖీ చేయబడుతుంది.

ఈ విభాగానికే మెషీన్ షాప్ చేర్చబడివున్నది. అందులో క్రాంక్ షాఫ్ట్ గ్రైండింగ్ మిషన్, వాల్వ్ సీట్ రీఫేసర్, పిస్టన్ హోనింగ్ మిషన్, సిలండరు రీ బోరింగ్ మిషనులు, బుషెస్‌ను కోసే తరిమెనలు మొదలైనవి ఉంటాయి. ఇటీవలనే ఇందులో రీమెటలింగ్ శాండ్ బ్లాస్టింగ్‌కు సరిక్రొత్త యంత్రం నెల

కొల్పబడింది. ఏ విడిభాగం పైనైనా రేకు దెబ్బతిన్నా లేక కొరుక్కుపోయినా దానిపై పూత వేయడానికి ఈ యంత్రం ఉపకరిస్తుంది.

ఈ కర్మాగారంలో విద్యుచ్ఛక్తి సంబంధమైన కోత యంత్రం నెలకొల్పబడింది. ఇది లోహములను కోయుటకు ఉపయోగపడుతుంది.

కర్మాగారంలోని రెండవ గ్రూపు ఈ క్రింది విభాగములతో కూడి ఉన్నది.

౧. మోటారు సైకిల్ ౪ వ లైన్, ౨. బండ్లు ౪ వ లైన్, ౩. పెయింటింగ్, ౪. బాడీబిల్డింగ్ కార్పెంటరీ, ౫. అప్ హోల్ స్ట్రీ. ఇందులో బండ్లు, మోటారు బండ్లు పూర్తిగా ఊడదీయబడి, శుభ్రపరచబడి, పరీక్షింపబడి తిరిగి ఏకంగా కూర్పుచేయబడుతాయి. పాతచట్టాలను తీసివేసి, కొత్తగా నిర్మింపబడిన సీట్లను అమర్చి, స్ప్రే పెయింటింగ్ చేయడమవుతుంది.

మూడవ గ్రూపులో పెద్దపెద్ద మరమ్మతులు చేయబడుతాయి. ఇందులో ౧. మూడవలైన్ మోటార్ సైకిల్ మరమ్మతు విభాగం, ౨. మూడవలైన్ బండ్ల మరమ్మతు విభాగం, ౩. ఉద్యోగుల కార్ల మరమ్మతు విభాగం కలవు.

ఈ కర్మాగారంలో తుక్కు లోహము నుంచి మోటారు సైకిళ్ళకు గేర్ పరీక్ష చేసే బెంచీ తయారు చేయబడింది. కర్మాగారంలోని నాల్గవ గ్రూపులో ఈ క్రింది విభాగాలున్నవి. ౧. మౌల్డింగ్, ౨. వెల్డింగ్, ౩. బ్లాక్‌స్మిత్, ౪. టిన్‌స్మిత్, ౫. వల్కనైజింగ్, ౬. బండ్ల చెల్లింప మరమ్మతు విభాగం.




వర్కుషాపులో సర్వీసింగ్ స్టేషన్

ఇక్కడ విద్యుచ్ఛక్తితో నడుపబడే బ్లోయర్ యంత్రం వివిధ అగ్ని ప్రసారక పాయింట్లపై ఎయిర్ బ్లాస్టును ఫీడ్‌చేస్తూ ఉంటుంది.

వల్కనైజింగ్ పని కూడా ఆధునిక పద్ధతుల ప్రకారం జరుపబడుతుంది. అయిదవ గ్రూపు వివిధ రకముల ఎలక్ట్రికల్ సామానుల తయారీ మరియు వాటికి సంబంధించిన మరమ్మతులను నిర్వహిస్తుంది.

## బ్యాటరీ తయారీ

తుక్కు సరుకులనుంచి ఇక్కడ బ్యాటరీ తయారు చేయబడుతుంది. పైగా దాని తయారీకయ్యే ఖర్చు మార్కెట్ రేట్లకు సగం మాత్రమే అవుతున్నది. పాత బ్యాటరీ ప్లేట్లయొక్క సీసపు తునకలతో మరి కొంత సీసం కలిపి, ఆ మిశ్రమంతో కొత్త బ్యాటరీ ప్లేట్లు అచ్చు పోయబడుతాయి. ఈ ప్లేట్లు గ్యాస్‌తో గాని లేక ఎలక్ట్రిక్ వెల్డింగుతోగాని అతకబడతాయి. మార్కెట్లో వాటి కంటె ఈ బ్యాటరీలే ఎక్కువ సమర్థవంతంగా పనిచేస్తాయి.

చాలా తక్కువ ఖర్చుతో ఈ కర్మాగారంలో బ్యాటరీ కేబిల్సు తయారుచేయబడుతున్నవి. డైనమో నుంచి కాల్చబడిన తీగె మందమైన కేబిల్‌గా తిప్ప బడుతుంది. ఆ కేబిల్ పై ఇన్సులేషన్ టేపు రబ్బర్ గొట్టం ఉంటాయి. తీగెయొక్క రెండు చివరలు మెటల్ కేసులతో సీలుచేయబడి ముక్కలతో తయారు చేయబడిన సీసపు హెడ్సుతో నింపబడుతాయి.

రిట్రీవింగ్ సెక్షన్‌లో కాలిపోయిన డైనమోలుకొత్త తీగెతో మళ్ళీ మరమ్మత్తు చేయబడుతాయి. బుషెస్ వంటి చిన్న విడిభాగాలు కూడా తయారుచేయబడు తాయి. ఎలక్ట్రికల్ పనిముట్లన్నీ ఈ విభాగంలో మరమ్మతుచేయబడి స్టోర్సుకు పంపబడుతాయి.

ఆధునిక పద్ధతులపై ఒక బ్యాటరీ చార్జింగ్ యంత్రం కూడా నెలకొల్పబడింది.

డిస్టిల్డ్ వాటర్ తయారుచేసే యంత్రం కూడా నెలకొల్పబడింది. ఇందులో రోజుకు ౪ జాడీలు (అంటే పదిగ్యాలనులు) చొప్పున డిస్టిల్డ్ వాటర్ తయారుచేయబడుతుంది. దీని కొరకు వేరే శ్రమ, అదనపు ఖర్చు అక్కరలేదు. మార్కెటునుండి డిస్టిల్డ్ వాటర్ కొనడం లేదు. మార్కెట్లో అది పది అణాల ఖరీదుకు లభిస్తుంది. కాని ఈ కర్మాగారంలో తయా రయ్యే దానికి ౬ పైసలకంటె తక్కువగానే ఖర్చు అవుతుంది.

## ప్లానింగ్ విభాగం

ప్లానింగ్ విభాగం నేరుగా పోలీసు రవాణా అధి కారి క్రింద పనిచేస్తున్నది. ఆయనకు సహాయకుడుగా ఒక వర్కుషాప్ ఆఫీసరు ఉంటాడు. కర్మాగారంలో జరిగే పనుల రికార్డులు వర్కుషాప్ ఆఫీసర్‌వద్ద ఉంటవి. వర్కుషాపు అవసరాలను తెలుసుకోవడం, పనివారల సామర్థ్యాన్ని హెచ్చించడం, మరమ్మతు పనులు త్వరగా జరుగునట్లు చూడడం, పనియొక్క అభివృద్ధిని తెలిపే చార్టులను, బోర్డులను తయారు చేయడం, వివిధ దశలలో మరమ్మతు పనుల విలు వను అంచెనా కట్టడం, బండ్లకు తగిల్చిన విడిభాగా లను తనిఖీ చేయడం మొదలగు పనులన్నిటికీ ఈ విభాగం బాధ్యత వహిస్తుంది.

మూడవ డివిజను టెక్నికల్ స్టోర్సుకు సంబంధిం చినది. ఇది రెండు భాగాలుగా ఉంటుంది. ఒకటి కొత్తభాగం, రెండవది పి. డబ్ల్యు. యస్. అని వ్యవ హరించబడుతుంది. పాత విడిభాగాలన్నిటినీ కొద్ది పాటి మరమ్మతుల కొరకు వర్కుషాపుకు పంపించి ఆ తరువాత అవి పి. డబ్ల్యు. యస్. స్టోర్సులో నిలువ చేయబడుతాయి.

స్టోర్సునన్నిటినీ వేటికవి వేరే చేసి బండ్లవారీగా అంటే జీప్, డాడ్జి, ఫోర్డు మొదలగు క్రమం ప్రకారం, మోటారు సైకిళ్లు అయితే నార్టన్, బి. యస్. ఎ. మొదలగు క్రమం ప్రకారం ఒక్కొక్క విడిభాగం ఒక్కొక్క అరలో ఉంచబడుతుంది. అరలోవున్న వస్తువులను ఏవైనా ఉపయోగం కొరకు ఇచ్చివేసి నప్పుడు గానీ, లేక కొత్త విడిభాగాలను అరలో పెట్టినపుడుగానీ పేరులు, రికార్డులు మొదలగునవన్నీ పదిలంగా ఉంచబడుతాయి. కొత్త స్టోర్సుకు పి. డబ్ల్యు. యస్. స్టోర్సుకు బండ్లవారీగా వేర్వేరు ఖాతా పుస్తకాలు ఉంచబడుతాయి.



వర్కుషాపులోని ఒక విభాగంలో శిక్షణపొందుతున్న అభ్యర్థులు.

ఒక మాడల్ రూం కూడా కలదు. ఇందులో విడిభాగములు ఏవిధంగా పనిచేసేదీ ప్రత్యక్షంగా ప్రదర్శింపబడుతుంది. ఈ పని అంతా ఒక ఎలక్ట్రికల్ మోటారు ద్వారా చూపబడుతుంది. ప్రత్యక్ష ప్రదర్శనం కొరకు ఎలక్ట్రికల్ సిస్టం మాడల్ కూడా ఏర్పాటు చేయబడింది. ఇదంతా పనికిరాని పాతముక్కలతోనే నిర్మించడం జరిగింది.

ప్రభుత్వ మంజూరీ తీసుకొని పోలీసుశాఖ ఉద్యోగులకు మోటార్లు నడపడంలోను, వాటిని సరిగా నిర్వహించుకోవడంలోను శిక్షణ ఇచ్చేటందుకై ఒక శిక్షణ కేంద్రం స్థాపించబడింది. ఉద్యోగులు ఇటువంటి శిక్షణ పొంది ఉండటంవల్ల బండ్లను సరిగా ఉపయోగించి అవి ఎక్కువకాలం మన్నికగా ఉండునట్లు చూడగలుగుతారు. సాంకేతిక విద్యాశాఖ డైరెక్టరు వర్కుషాపును తనిఖీచేసిన తరువాత, ప్రభుత్వము ఈ కేంద్రమును ఒక సాంకేతిక సంస్థగా పరిగణించి, విద్యార్థులకు అందులో శిక్షణ ఇవ్వడానికి తమ ఆమోదాన్ని తెలిపింది.

*       *       *

# * వార్తా చిత్రాలు *



ఉస్మానియా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవం :

మధ్యప్రదేశ్ గవర్నర్ డా. పట్టాభి సీతారామయ్యగారు 1955 డిసెంబరు 24 తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయ స్నాతకోత్సవంలో స్నాతకోపన్యాస మిచ్చారు. గవర్నరుగారికి కుడిప్రక్కన విశ్వవిద్యాలయ ఛాన్సలర్ డా. బి. రామకృష్ణారావుగారున్నారు.



హైదరాబాదులో ప్రధాన మంత్రి :

1955 డిసెంబరు 8 వ తేదీన ప్రధాన మంత్రి శ్రీ జవహరలాలు నెహ్రూ హైదరాబాదుకు విచ్చేసినపుడు బేగంపేట విమానాశ్రయంలో ముఖ్యమంత్రిగారు తమ మంత్రివర్గ సభ్యులను వారికి పరిచయంచేయగా ప్రధాని వారితో కరచాలనం చేస్తున్నదృశ్యం.



(ఎగువ) బేగంపేట విమానాశ్రయంలో హెచ్. యస్. ఆర్. వి. దళం సమర్పించిన గౌరవ వందనాన్ని స్వీకరిస్తున్న ప్రధాన మంత్రి శ్రీ నెహ్రూ.

(దిగువ) హైదరాబాదులో అంజుమన్ తరక్కీ ఉర్దూ భవనానికి ప్రధాన మంత్రి ప్రారంభోత్సవం సల్పారు.



రేడియం ఇన్‌స్టిట్యూట్ మరియు కేన్సర్ ఆసుపత్రికి ప్రధానమంత్రి ఇటీవల ప్రారంభోత్సవం చేశారు.

కేన్సర్ ఆసుపత్రిలో యంత్రసామగ్రిని పరిశీలిస్తున్న శ్రీ నెహ్రూ





(ఎగువ) హిజ్ మెజస్టీ సౌదీ అరేబియా రాజు 1955 డిసెంబరు 5వ తేదీన బేగంపేట విమానాశ్రయంలో భారత వైమానిక దళం సమర్పించిన గౌరవ వందనాన్ని స్వీకరిస్తున్నదృశ్యం

(దిగువ) హిజ్ మెజస్టీ సౌదీ అరేబియా రాజు హైదరాబాదు ముఖ్యమంత్రితో కలిసి విమానాశ్రయంనుంచి నగరానికి విచ్చేస్తున్నారు.





(ఎగువ) హిజ్ మెజస్టీ సౌదీ అరేబియా రాజుకు జూబ్లీ హాలులో విందు చేయబడింది.

(దిగువ) చైనీస్ గార్డెన్సులో ఇవ్వబడిన విందులో సవూద్ రాజు ఆతిథేయులతో ముచ్చటిస్తున్నారు.



(ఎగువ) షామంజిల్‌లో చేయబడిన విందులో సవూద్ రాజు.

(దిగువ) షామంజిల్‌లో హిజ్ మెజస్టీ సౌదీ అరేబియా రాజు, హైదరాబాదు రాజప్రముఖ్, హైదరాబాదు ముఖ్యమంత్రి, ఇతర ప్రముఖులు.





హిజ్ మెజస్టీ సవూద్ రాజుకు పౌర సన్మానం జరిగిన సందర్భంలో సికింద్రాబాదు మేయర్ సన్మానపత్రం చదివారు.

ఇండోనేషియా పోలీసు అధిపతి మిస్టర్ శ్రీకంపో షామంజిల్ లో హైదరాబాదు
ముఖ్యమంత్రిని కలుసుకొని సంభాషించారు.





ఇండోనేషియా పోలీసు అధిపతి గోల్కొండలో హెచ్. యస్. ఆర్. వి. ప్రథమ బెటాలియన్ సమర్పించిన గౌరవ వందనాన్ని స్వీకరించారు.

# ★ టెలిఫోను ఎలా వినబడుతుంది? ★

శ్రీ జె. వి. రామారావు, ఎల్. యం. ఇ. ఇ.,
ఎ. యం. ఐ. ఇ. (ఇండియా) ఎ. యం. ఐ. ఇ. ఇ. (లండన్)
(అసిస్టెంటు ఇంజనీర్, డిస్ట్రిక్టు పవర్ స్కీమ్సు)

విద్యుచ్ఛక్తి సహాయంతో ఒకచోటనుంచి మరొక చోటికి వార్తలు ఎలా ప్రసారమవుతయో ఆయా శాస్త్రములు నేర్చుకొనే విద్యార్థులకు, అవృత్తిలోఉండే పనివాళ్ళకు పూర్తిగా తెలిసిఉంటుంది. ఇక మిగతావాళ్ళకి ఇప్పటికికూడ అది ఒక పద్మవ్యూహమే. మీకు తెలుసో తెలియదో- మునుపటికి స్కాట్లాండుదేశపు అబర్డీన్ అనే పట్టణంలో ఒక పోస్టుమాస్టరు ఉండేవాడట. ఆయన నిత్యమూ టెలిఫోనులో మునుగుతూ తేలుతూ ఉండేవాడు. గనుక దాని విషయము ఆయనకు బాగా తెలిసి ఉంటుందని తలచి ఆ వూరి వాళ్లు టెలిఫోను ఎలా పనిచేస్తుందో చెప్పమని అడిగారు. వెంటనే ఆయన "ఇదిగో ఈ కుక్కను చూడండి. దీనికాళ్లు ఇక్కడ గట్టిగా పట్టుకొని తలను గ్లాస్కో పట్టణమువరకు గుంజిపట్టి ఇక్కడ తోక తొక్కితే గ్లాస్కోలో మొరుగుతుంది." అంటూ చెప్పాట్ట. ఇలాంటి ఊహలోనే ఉండే మనుష్యులు ఈ ఇరవయ్యో శతాబ్దంలోకూడా లేకపోలేదు. గ్రామఫోను నుండి పాటలు ఎలా వినపడేవి. రేడియోనుండి వార్తలు వగైరాలు ఎలా వచ్చేదికూడ ఇలాంటి ఊహలతోనే సమాధానపరచుకొని తృప్తిపడేవారున్నారు.

అసలు ఈ టెలిఫోను విషయంలోని సాంకేతిక సూత్రాలు చిక్కులేనివి, సులభ గ్రాహ్యాలు. ఒకచోటనున్న శబ్దాలను ఇంకొక చోటకు పంపించే సాధనానికే టెలిఫోను లేక దూరశ్రవణ యంత్రమని పేరు. 'గ్రాహం బెల్' అనే మహనీయుడు దీన్ని క్రిందటి శతాబ్దంలో కని పెట్టాడు.

మనం మాటలాడినప్పుడు వచ్చే శబ్ద తరంగాలు తాకునట్లు ఒక సన్నని ఇనుపరేకు ఇందులో అమర్చబడి ఉంటుంది. దీన్ని డయాఫ్రమ్ అంటారు. ఈ తరంగముల వల్ల మన చుట్టూ ఆవృతమైయున్న గాలిలో కలిగిన చలనముచే, డయాఫ్రమ్ ముందుకు వెనుకకు ప్రకంపిస్తుంది. దీని వెనుక గుర్రపు నాళ ఆకారముగల ఒక అయస్కాంతము ఉంటుంది. దీనికి దక్షిణధ్రువము ఉత్తరధ్రువము అనెడి రెండు ధ్రువములుంటాయి. ఉత్తరధ్రువమునుండి, దక్షిణధ్రువానికి డయాఫ్రమ్ద్వారా అయస్కాంత స్రవంతి స్వతస్సిద్ధముగా ప్రవహిస్తూ ఉంటుంది. అయితే శబ్దతరంగములవలన డయాఫ్రమ్లో ముందువెనుకలకు ప్రకంపముండుటచే యీ అయస్కాంత స్రవంతిలో బలము హెచ్చుచూ, తగ్గుచూ ఉండును. టెలిఫోను తీగను ఈ అయస్కాంతముకు కొన్ని చుట్లుచుట్టి తీసికొని పోవుదురు. గనుక శబ్ద తరంగములు అనుకరణముతో అయస్కాంత స్రవంతి హెచ్చుతగ్గులు గలిగియుండి యీ విద్యుద్వాహిక చుట్లలగుండా ప్రవహించుచూ తద్వారా టెలిఫోను తీగలో విద్యుత్తరంగములతో ఉద్భవింపజేసి పంపును. నిర్ణీతస్థలముచేరిన యీ తరంగములు అచటి టెలిఫోను యంత్రములలో ప్రవేశించును. వీటివల్ల, వీటి అనుకరణరాగముగల అయస్కాంత స్రవంతిపుట్టి డయాఫ్రమ్ను ప్రకంపింపజేసి చుట్టు ఆవృతమైయున్న గాలిలో ఒత్తిడి తేలికల సమకూర్చి, ఇచట ఏమి మాట్లాడామో దానినకలే అచట వినబడునట్లు చేయును.

మనము వాడే టెలిఫోన్లు యిదే సూత్రంమీద పని చేస్తాయి. అయితే శబ్దములవల్లపుట్టు విద్యుచ్ఛక్తి చాల కొద్ది పరిమాణము గలదగుటచే, బ్యాటరీల కరెన్టును ఇందుతో దొందుపరిచి శబ్దము పెద్దగా వినబడునట్లు చేస్తున్నారు. టెలిఫోనువల్ల మాటలు ఎలా వినబడుతాయో ఇప్పుడు తెలుసుకొన్నాము. కాని టెలిఫోన్లో మాటలాడేముందు మనకు ఎవరో మాటలాడ నుద్దేశించుచున్నారని సూచించుటకు గుర్ గుర్—గుర్ గుర్ అని గంటవినిపిస్తుంది. అదేలా జరుగుచున్నదో కూడా తెలుసుకోవాలి.

మన ఇండ్లలో వాడే టెలిఫోను పనిముట్లను Hand sets అని అందురు. వీటికి రెండు వంకెలుండి వాటిమీద రిసీవర్ అను యంత్రభాగము పెట్టబడియుండును. ఈ రిసీవర్‌కు రెండు కొన లుండును. టెలిఫోనులో మాటలాడువారు రిసీవర్‌ను Hand set నుంచి తీసి దాని ఒక కొన తమ నోటివద్ద, రెండవ కొనను చెవివద్ద వుండునట్లు పట్టుకొని మాటలాడుదురు. వీరి మాటలవల్ల పుట్టు శబ్దతరంగములు తమ నోటికి దగ్గరగానున్న రిసీవర్ కొనలోకి ప్రవేశించి, విద్యుత్తరంగములుగా మారి దూరమున నున్నవారి వద్దకు టెలిఫోను తీగద్వారా పోయి అచ్చట శబ్దతరంగములుగా మారి వారికి వినబడును. వారి జవాబు మాటలవల్ల ఏర్పడు శబ్దతరంగములు ఇట్లే అచట విద్యుత్తరంగములుగా మారి టెలిఫోను తీగద్వారా వీరివద్దకు వచ్చి యిచట శబ్దతరంగములుగా మారి వీరి చెవివద్ద నున్న రిసీవర్ కొనలోనుంచి వినబడును. Hand set లోనే ఒక విద్యుద్ఘంట అమర్చబడి విచిత్రమైన వైరింగ్ చేయబడియుండును. టెలిఫోను వాడకుండా యున్నప్పుడు అనగా రిసీవర్ ఎత్తకుండా Hand set మీదనే పెట్టబడి యున్నప్పుడు మనం మాట్లాడే భాగపు సర్క్యూట్ బందు అయిపోయి టెలిఫోను డిపార్టుమెంటువారి ఎక్స్చేంజి లైన్లతో కలిసియుండును. అందువల్ల ఎవరైనా మనతో మాటలాడదలచి, వారు టెలిఫోను రిసీవరును ఎత్తగానే మన టెలిఫోను పనిముట్టులోని విద్యుద్ఘంట సర్క్యూట్ పూర్తికాబడి గంట గుర్ గుర్ మని మ్రోగును. ఇదివిని మనము రిసీవర్‌ను చేతిలోనికి తీసికొనగానే గంట సర్క్యూట్ బందు అయిపోయి మనం మాటలాడు సర్క్యూట్ అమలులోనికి వచ్చును. సంభాషణ ముగిసి రిసీవరు Hand set మీద వుంచబడగానే మరల విద్యుద్ఘంట సర్క్యూట్‌ను అమలులో ఉంచెదము.

ఇదీ టెలిఫోను పనిచేసే విధానం. హైదరాబాదు వంటి పెద్దపట్టణములలో టెలిఫోను నిర్మించుకున్నవారి సంఖ్య ఎక్కువగా ఉండును. గాని ఆటోమేటిక్ పద్ధతిమీద, అనగా ఎవరు ఎవరితో మాటలాడవలెనన్నచో తమంతటతామే టెలిఫోను ఎక్స్చేంజిలోని ఆపరేటర్ యొక్క సహాయంలేకుండా, నిర్ణీతసంఖ్యకు టెలిఫోను డైలును త్రిప్పి అందువల్ల కావలసిన లైనును కలుపుకొని నేరుగా మాటలాడెదరు. టెలిఫోను ఇట్టిస్థాయికి వచ్చిందంటే గ్రాహం బెల్ వేసిన గట్టిపునాదే కారణము. ఆయన చిరస్మరణీయుడని మనము జ్ఞాపకం ఉంచుకోవాలి. ఇట్టి విజ్ఞాన పోషకుల ఆదర్శం పిల్లల మనస్సుల్లో ఉంటేనేగాని వారు కనీసం విజ్ఞాన వేత్తలయినా కాలేరు. మన భారత మాతకూడా ఇటువంటి విజ్ఞాన పోషకులను చాల మందిని కన్నది. భాస్కర పండితుడీ శ్రేణిలోని వాడే. ఆధునిక యుగంలో మన సర్ సి. వి. రామన్ కూడా ఇటువంటి వాడే సుమా!



# * జోగిపేటలో సహకార సప్తాహం *

మెదకు జిల్లా ఆందోలు తాలూకా జోగిపేటలో ౧౯౫౫ నవంబరు ౫ వ తేదీనుంచి ౧౧ వ తేదీ వరకు అఖిల భారత సహకారసప్తాహం జరుపబడింది.

నవంబరు ౫ వ తేదీన శ్రీ వెంకట రాజేశ్వర జోషి, యం. యల్. ఎ. గారి అధ్యక్షతన సభ జరిగింది. ఈ సభలో ట్రెయినింగులో ఉత్తీర్ణులయిన కార్యకర్తలకు సర్టిఫికెట్లు ఇవ్వబడినవి. ఈతాలూకాలో పది సహకార గ్రామ పరపతి సంఘాలను స్థాపించడానికి తీర్మానించబడింది. ఇతర తీర్మానములుకూడా ఆమోదింపబడినవి.

నవంబరు ౮ తేదీన 'పారిశ్రామిక దినోత్సవం' జరుపబడింది. రాష్ట్రీ ఉపమంత్రులు శ్రీ విరూపాక్షప్ప, శ్రీ శంకర్ దేవ్ గారలు పాల్గొన్నారు. నూతనంగా స్థాపించబడిన సిల్కు చేనేత ఉన్ని చర్మ పని



*సహకార సప్తాహం సందర్భంగా 1955 నవంబరు 7 వ తేదీన జోగిపేటలో పారిశ్రామిక దినోత్సవం జరుపబడింది. ఆనాటి ఊరేగింపు దృశ్యం.*

[illegible]



సహకార సప్తాహం
సందర్భంలో
1955 నవంబరు
10 వ తేదీన
జోగిపేటలో
మహిళలదినోత్సవం
జరుపబడింది.



1955 నవంబరు
9 వ తేదీన
ఆందోల్ లో
రైతుల దినోత్సవ
సందర్భంలో
జరిగిన
ఊరేగింపు.

# ★ హైదరాబాదు రాష్ట్ర పరిశ్రమలకు ఉజ్జ్వల భవిష్యత్తు ★

*రెండవ పంచవర్ష ప్రణాళికలో హైదరాబాదు రాష్ట్రంలో పెద్దయెత్తున పరిశ్రమలు స్థాపించ డానికై పథకములు తయారు చేయబడినవి. క్రొత్తగా అనేక పరిశ్రమలను నెలకొల్పడమేగాక ప్రస్తుతమున్న పరిశ్రమలను కొన్నింటిని విస్తృత పరచడానికి కూడా తలపెట్టబడింది. ఇందు కొరకై ప్లానింగ్ కమీషన్ వారు రూ. ౧౧.౩౦ కోట్లు ఖర్చుఅయ్యే పథకాలను ఆమోదించారు.*

హైదరాబాదురాష్ట్రం భారత దేశంలోని కొన్ని ఇతర పెద్ద రాష్ట్రాలకన్నా పారిశ్రామికంగా చాలా వెనుకబడి వుంది. స్థానిక మార్కెట్లను పరిశీలించినవారి కెవరికైనా ఈవిషయం స్ఫురిస్తుంది. ఈరాష్ట్రం వైశాల్యంలో చిన్నది కాదు. సహజ సంపదలు కూడా చాలావున్నాయి. సామాన్య వ్యక్తియొక్క దైనందినావసరములైన అగ్గిపెట్టెలు, సబ్బు బిళ్ళలు మున్నగువాటి కొరకు ఇతర రాష్ట్రాలకు పోవలసిన అవసరం వుండదు, అయినప్పటికీ, నేడు హైద్రాబాదువాసి ఇట్టి స్వల్ప వస్తువులను ఇతర చోట్లనుండి దిగుమతి చేసుకో వలసి వస్తున్నది. స్థానికంగా కొన్ని వస్తువులు లభించి నప్పటికీ, వాటి నాణ్యం తక్కువగా ఉండటంవల్ల, అవి దిగుమతియగు వస్తువులతో పోటీకి నిలబడలేకుండా వున్నవి. స్థానిక పరిశ్రమలకు తగు రక్షణ అంటూ లేకపోవడంవల్ల ఉత్పత్తి పద్ధతులు సమర్థవంతంగా వుండి, వస్తువు నాణ్యం మేలిమిగా వుంటేనే అవి మనగలిగి అభివృద్ధి చెందుటకు అవకాశ ముంటుంది.

లఘుపరిశ్రమల కవసరమైన ముడిపదార్థములు ప్రజల దైనందిన వినిమయం కొరకు అవసరమైన కొన్ని ఇతర పదార్థములు హైద్రాబాదు రాష్ట్రంనుంచి విశే షంగా ఎగుమతి చేయబడుతున్నవి. అందువల్ల రాష్ట్రి ప్రజలు వాటి కొరకు విపరీతంగా ఎక్కువ ధరలు చెల్లించ వలసి వస్తున్నది. దీనికంతా దళారీలే కారణం. లాభాలన్నీ వారే గడిస్తున్నారు. దీని పర్యవసాన మేమంటే వస్తువులకు ధరలు ఎక్కువగా వున్నప్పటికీ ఉత్పత్తి దారునికిమాత్రం లాభం కలగడంలేదు. అంతేగాక, దిగుమతియగు వస్తువులు ఇక్కడ పోటీ ధరలకు లభిస్తాయి. ఎందుకంటే వీటిని ఉత్పత్తి చేయువారు వాణిజ్య వ్యాపారాలలో చాకచక్యం గలవారు. వారికి విశేష ఆధారాలు అందగా వున్నాయి. మార్కెట్లలో వారి సరుకులకే గిరాకీ వుంటుంది. దళారీల జోక్యం లేకుండా చేసినట్లయితే ఆర్థిక ప్రగతి సాధించడానికి వీలుంటుంది. హైద్రాబాదు ముడిపదార్థాలను ఎగుమతిచేసి, తయారైన వస్తువులను, విలాస వస్తువులను దిగుమతి చేసు కొంటున్నది. ఈ దిగుమతి వస్తువులు రాష్ట్ర శక్తి స్తోమతలకు తలమించి వుంటున్నాయి. రాష్ట్రంలో పరిశ్రమలు అభివృద్ధి చెందినట్లయితే ముడి సరుకులను ఎగుమతి చేయడానికి బదులు ఇక్కడనే ఉపయోగించుటకు అవకాశ ముంటుంది.

ఏదేశమైనా పారిశ్రామికంగా అభివృద్ధి పొందాలంటే ప్రజల వృత్తి వ్యాపారములు వ్యవసాయ రంగంనుంచి వ్యవసాయేతర రంగాలకు తరలించబడాలి. హైద్రాబాదులో గత ౧౦ సంవత్సరాల జనాభా లెక్కలను పరిశీలించినట్ల యితే పరిస్థితి ఇందుకు పూర్తిగా విరుద్ధంగా ఉన్నదని తెలుస్తుంది. ఇక్కడ వ్యవసాయంపై ఆధారపడు ప్రజల సంఖ్య పెరుగుతూనే ఉన్నది. బొంబాయి, పశ్చిమ బెంగాలు, మైసూరు, ఇండోర్ మున్నగు రాష్ట్రాలలో పరిశ్రమలలో పనిచేస్తున్న ప్రజల ప్రతి శతితో పోల్చి చూస్తే హైద్రాబాదు వాటన్నిటికంటే చాలా వెనుకబడి యున్నదని కూడా తెలియ గలదు.

౧౯౫౫-౫౬ సంవత్సరంలో మన రాష్ట్రంలో తల ౧కి ఆదాయ వ్యయాలు వరుసగా రూ. ౧౪ లు, రూ. ౧౪.౩ లు ఉండినాయని నివేదించబడింది. అయితే ఉత్తరప్రదేశ్‌లో ఇవే అంకెలు వరుసగా రూ. ౧౭.౭౭ లు, రూ ౧౯.౯౬ లు, మైసూరులో రూ. ౨౦.౯ లు, రూ. ౨౨.౩ లు, పెప్సులో రూ. ౧౬.౦ లు, రూ. ౧౭.౭ లు తిరువాన్కూరు కొచ్చిన్ రాష్ట్రంలో రూ. ౧౬.౨ లు, రూ. ౧౬.౧ లు వుండినవి.

భారతప్రభుత్వం దేశంలోని వివిధ ప్రాంతాలలో వినిమయ ఖర్చునుగూర్చి నమూనా లోగట్టా సేకరించింది. వినిమయ ఖర్చువిషయంలో పశ్చిమోత్తరప్రాంతం అన్నిటికన్నా ముందుగా ఉన్నదనీ, హైద్రాబాదుతో కలుపుకొని మధ్య

ప్రాంతం వెనుకబడివున్నదని ఈ భోగట్టాలో నివేదించబడింది.

## ఫ్యూడల్ ఆర్థిక విధానం

ఈ రాష్ట్రం వెనుకబడి వుండుటకు ఇటీవలవరకు రాష్ట్ర రాజకీయ చరిత్ర ఫ్యూడల్ ఆర్థికవిధానంతోకూడి వుండడమే ప్రధానకారణం. ఇక్కడి సాంఘిక సాంప్రదాయాలు రాష్ట్రం ఆధునికస్థాయికి వచ్చుటకు అవరోధంగా వుండినవి. వ్యవసాయంకూడా పాత పంథాలోనే ఉండింది. వ్యవసాయాభివృద్ధికి ఏలాంటి సంస్కరణలుకూడా చేయబడలేదు. ఇక్కడ ఉండిన 'పరిశ్రమలు' కుటీర పరిశ్రమల రకానికి చెందినట్టివే. ఇవి ధనవంతులైన కొద్దిమంది ప్రముఖ వ్యక్తుల యిష్టాయిష్టాలను తీర్చు వస్తువులనుమాత్రమే ఉత్పత్తిచేస్తూ ఉండేవి. కానీ స్వతంత్రంగా పనిచేసి విస్తృత మార్కెట్లను అన్వేషించు పారిశ్రామికులను ఈ ప్రముఖులు ఏమాత్రం ప్రోత్సహించలేదు. గ్రామ పారిశ్రామికునకు వస్తువులను ఉత్పత్తిచేయుటకు కావలసిన మూలధనం లేకుండింది. అంతేగాకుండా వస్తువులను పెద్దఎత్తున ఉత్పత్తిచేసే ఏవిధమైన భారీపరిశ్రమను అభివృద్ధిపరచుటకుకూడా అతనికి అనుమతి దొరికేదికాదు. ఈవిధంగా పారిశ్రామికులకు ఏలాంటి ప్రోత్సాహమూ లభించలేదు. ప్రజాస్వామ్య వాతావరణం హస్యాస్యమయినందువల్ల, నిపుణతగల పారిశ్రామికులు, అభివృద్ధిపథంలో స్వేచ్ఛగా ఆలోచించుకొని క్రొత్త యంత్రాలను కొనడానికికూడా అవకాశం లేకపోయింది. పైగా ఉత్పత్తిదారుని అణచి త్రొక్కివుంచడంలో ఆసక్తిగల ధనిక భూస్వాములకు అధికారవర్గం శక్తివంచన లేకుండా మద్దతు యిచ్చింది.

మహాజనులుకూడా బీదపారిశ్రామికులకు అప్పులిచ్చుటకు బదులు సోమరులైన భూస్వాములకు అప్పులిచ్చి విశేష లాభాలార్జించవచ్చని తలచేవారు. అయితే బీదవారికి అప్పులిచ్చి విపరీతంగా వడ్డీలు గుంజి దయా దాక్షిణ్యాలు లేకుండా వారిని పీడించారు.

ఇక్కడ పరిశ్రమలు దెబ్బతినడానికి చౌకధరలో విద్యుచ్ఛక్తి లభించక పోవడంకూడా ఒక కారణం. ఇతర అనేక అననుకూలాలవల్ల ఈ రాష్ట్రంలో పరిశ్రమలకై బయట నుంచి మూలధనాన్ని పెట్టుబడి పెట్టుటకు అనేక అడ్డంకులు వుండినవి.

స్వాతంత్ర్యానంతరము శాంతిభద్రతల సమస్యలు, ఇతర అభివృద్ధిపనులకు సంబంధించిన సమస్యలను పరిష్కరించుటకై రాష్ట్ర ఆదాయంపై విశేషభారం పడడంవల్ల అప్పుడు వుండిన పరిశ్రమలుకూడా చాలా దెబ్బతిన్నవి. కొన్ని ఏండ్లు జరిగిన తరువాతనే ఆర్థికాభివృద్ధికై తగు కృషి చేయుటకు సాధ్యపడింది.

## పారిశ్రామికాభివృద్ధికి మూలాధారాలు

ఎక్కడయినా పరిశ్రమలు అభివృద్ధి చెందాలంటే మూలధనం, ముడిపదార్థాలు, మార్కెట్లు, ఆర్గనైజేషన్, సాంకేతిక నిపుణులు, సంస్థల నిర్వాహకసామర్థ్యంగలవారు, కార్మికులు లభించడం చాల అవసరం. పరిశోధనాసౌకర్యాలుగూడా వుండాలి.

ప్రజలు పొదుపరితనాన్ని అలవరచుకొంటే, మిగులు డబ్బుతో మూలధనాన్ని సేకరించవచ్చును. ఆర్థికరీత్యా భారతదేశం పేదదేశం. దాని జాతీయ ఆదాయం ప్రస్తుతం సుమారు రూ. ౧౦,౦౦౦ కోట్లుమాత్రమే ఉన్నదని అంచనా వేయబడింది. కనుక సేవింగ్సుశాతం చాలా తక్కువగానే వుంటుంది. హైద్రాబాదు రాష్ట్రంలో ప్రస్తుతం సేవింగ్సు ౧౦ నుంచి ౨౦ కోట్ల మధ్య వుండవచ్చని భావించినప్పటికీ అవి పరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటకు ఆసక్తిలేని భూస్వాములు, ఇతర ధనికవర్గాల ప్రజలచేతిలోనే ఉన్నవి. తత్ఫలితంగా పారిశ్రామిక సంస్థలు ఇక్కడ అభివృద్ధి చెందలేదు. అయితే రాష్ట్ర ప్రభుత్వంచేత ప్రోత్సహించబడిన వ్యవస్థలు మాత్రమే పారిశ్రామికసంస్థలకు ఆర్థికసహాయం చేస్తున్నవి.

ఇప్పుడు మేనేజింగ్ ఏజెంట్లసంస్థకూడా వీటికి తగు ధనసహాయం చేస్తున్నది. అయితే ఇది సక్రమంగా నడుస్తున్న పరిశ్రమలకే సహాయంచేస్తుంది. కాని తమ కాళ్ళపై నిలబడుటకుకూడా ఆస్కారంలేని సంస్థలకు ఆర్థికసహాయం చేయదు.

ఇక్కడ కంపెనీల వాటాలు కొనడంలో డబ్బు పెట్టుబడి పెట్టే ప్రజలు వహిస్తున్నపాత్రకూడా అంత ప్రోత్సాహకరంగా లేదు. కంపెనీల వ్యాపారంపట్ల వారికి విశ్వాసం లేకపోవడమే ఇందుకు కారణం. గత యుద్ధసమయంలో అవసరాలు, కొరతలు ఏర్పడినందువల్ల అనేక పరిశ్రమలు నెలకొల్పబడినవి. వాటికి తగు ప్రోత్సాహం లభించింది. యుద్ధానంతరం అవి త్వరలోనే మూసివేయబడినాయి. చాలాకాలం క్రిందటనే స్థాపించబడిన పరిశ్రమల లాభాలుకూడా పడిపోయినాయి. రాష్ట్రమంతటా పరిశ్రమలు తగ్గుముఖం పట్టినాయి. అవి ఇంతవరకూ చెప్పుకోతగినంతగా కోలుకోలేదు. సాంప్రదాయకంగా పాతభావాలుగల వ్యక్తి తన డబ్బును పరిశ్రమలలో పెట్టుబడి పెట్టుటకంటే తనవద్దనే ఉంచుకొనడం మంచిదని భావిస్తాడు. చాలా కంపెనీలు సాధారణ వాటాలు మాత్రమే జారీ చేశాయి. అవికూడా తమ స్నేహితులకే విక్రయించుతాయి. కొన్ని సంస్థలు మాత్రమే ప్రిఫరెన్సు

వాటాలు, డిబెంచర్స్ జారీచేస్తాయి. ఇక్కడ స్టాక్ ఎక్ఛేంజి స్తబ్ధంగా ఉంటుంది. వీటికితోడుగా అనుమతింపబడిన మూలధనానికీ, చెల్లింపు మూలధనానికీ మధ్య తేడా చాలా ఎక్కువవుతున్నది. పరిస్థితి ఇలా వుండగా చిన్నచిన్న సంస్థలు తమంతటతామే రద్దు అవుతున్నవి.

బయటినుంచివచ్చి ఇక్కడ నెలకొల్పబడిన వాణిజ్య బ్యాంకులు హైదరాబాదుయొక్క 'పరాధీన ఆర్థిక' పరిస్థితిని స్వప్రయోజనానికి వినియోగించుకున్నవి. ౧౮౬౮ సంవత్సరంలో ఇండియన్ బ్యాంకుయొక్క శాఖ ఇక్కడ ప్రప్రథమంగా నెలకొల్పబడింది. ఆ తరువాతనుంచి అనేక ఇతర బ్యాంకులు ఇక్కడ స్థాపించబడినవి. అయితే అవి యిక్కడి పారిశ్రామిక సంస్థలకు ఏలాంటి ఆర్థికసహాయంకూడా చేయలేదు. అవి తమ కార్యకలాపాలను ఎగుమతి–దిగుమతి వ్యాపారంలో పాల్గొనటంవరకు మాత్రమే పరిమితం చేసుకున్నవి. ౧౯౪౧ సం.లో హైద్రాబాదు స్టేటుబ్యాంకు స్థాపించబడడంవల్ల పారిశ్రామిక పరిస్థితిలో కొంతమార్పు వచ్చింది. అయినప్పటికీ వాణిజ్యబ్యాంకులు, మంచిలాభాలు పంచిపెడుతూ వుండిన పారిశ్రామిక సంస్థలకు మాత్రమే సహాయం చేసేవి. గత యుద్ధారంభంలో ఇవి ఎక్కువ లాభాలు గడించాయి. అయితే ఈ డబ్బును బ్యాంకులకు తమ అప్పులను చెల్లించుటకు వినియోగించినవి. అవి ౧౯౪౭-౪౮ వరకు కొన్ని సందర్భాలలో ౧౯౫౧ వరకు బ్యాంకులతో తిరిగి లావాదేవీలు ఏర్పాటుచేసుకోలేదు. చిన్న పరిశ్రమలకు ఆర్థికసహాయం అవసరమైంది. కానీ అవి వాణిజ్యబ్యాంకులనుంచి సహాయం పొందలేకపోయినాయి.

అయితే ఇక్కడ పరిశ్రమాభివృద్ధికై రాష్ట్రప్రభుత్వం చాలా డబ్బు పెట్టుబడిపెట్టింది. ప్రభుత్వానికి స్వంత రైల్వేలు (ఇవి ఇప్పుడు కేంద్రప్రభుత్వ పరమైనవి) రోడ్డు రవాణా, విద్యుచ్ఛక్తిశాఖ లుండినవి. అప్పులివ్వడంద్వారానూ, వాటాలు కొనుక్కోవడంద్వారానూ ప్రభుత్వం ప్రయివేటు పరిశ్రమలకు పెద్దమొత్తాలలో ధనసహాయం చేసింది. ప్రథమ పంచవర్ష ప్రణాళికా కాలంలో పరిశ్రమలవిషయమై చాలా తక్కువ శ్రద్ధవహించబడింది. అయినప్పటికీ ప్రభుత్వం సిర్పూరు పేపరు మిల్లులకు రూ. ౧౧౬ లక్షలు, సిస్సిల్కులిమిటెడ్ కంపెనీకి రూ. ౪౦౩ లక్షలు అప్పు ఇచ్చింది. రాక్షసిబొగ్గు ఉత్పత్తిని సాలుకు ౧½ మిలియన్ టన్నులవరకు అధికం చేయుటకై ప్రభుత్వం రెండుసంవత్సరాలలో రూ. ౯౬ లక్షలు ఖర్చుపెట్టవలసి వచ్చింది. ఇందుకై అదనంగా రూ. ౧౧౪ లక్షలు అవసరమైనాయి. రాష్ట్రప్రభుత్వం రూ. ౩౨·౧౯ లక్షలు కేటాయించింది. మిగిలిన మొత్తం పారిశ్రామిక ధర్మకర్తృత్వ నిధినుంచిలభించింది. ప్రభుత్వం నిజాం చక్కెరఫ్యాక్టరీ, అల్విన్ మెటల్‌వర్క్సు, సిర్పూర్ పేపర్‌మిల్స్, హైద్రాబాదు కెమికల్సు, ఫర్టిలైజర్సు లిమిటెడ్ కంపెనీల చెల్లింపు మూలధనంలో నూటికి ౫౦ వంతులకు పైగానే వాటాలు కొన్నది.

పరిశ్రమాభివృద్ధికై ఇక్కడ జరిగిన ముఖ్యమైన కృషి ఏమంటే ౧౯౨౯ సం. మార్చి నెలలో కోటిరూపాయల మూలధనంతో పారిశ్రామిక ధర్మకర్తృత్వనిధి ఏర్పాటు చేయబడింది. ఈ మొత్తంనుంచి ప్రయివేటు పారిశ్రామిక సంస్థలకు పెద్దమొత్తాలలో అప్పులివ్వబడినవి. అంతేగాకుండా ఇది కొన్ని పెద్దపరిశ్రమలకు మేనేజింగ్ ఏజంటుగాకూడా పనిచేసింది. ఇంతేగాక లఘుపరిశ్రమలు కుటీరపరిశ్రమల అభివృద్ధికి సహాయపడడం, సాంకేతిక శిక్షణను పొందగువారికై అభ్యర్థులకు విద్యార్థి ఉపకార వేతనములు ఇవ్వడం, పారిశ్రామికభోగట్టా వివారణలు సేకరించడం ఈ నిధియొక్క ముఖ్యకర్తవ్యములలో చేరియున్నవి.

ఈ నిధి సహాయం పొందిన మధ్యరకం పరిశ్రమలు చాలా మూసివేయ బడినవి. పెద్ద పరిశ్రమలు అన్నీ ఒకటి మినహా సక్రమంగా నడుస్తున్నవి.

పరిశ్రమలకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఇన్‌డస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్లు ఆర్థిక సహాయం చేస్తున్నవి. ౧౯౫౩ సం. లో కోటిరూపాయల చెల్లింపు మూల ధనంతో రాష్ట్ర ఫైనాన్సు కార్పొరేషన్ నెలకొల్ప బడింది. ఇది ౧౯౫౪-౫౫ సం. లో ౨౦ సంస్థలకు రు. ౩౮,౫౬,౦౦౦ల మేరకు ఆర్థిక సహాయం చేసింది.

## మార్కెటు పరిస్థితులు

హైద్రాబాదు పరిశ్రమలకు రాష్ట్రంలోనే విశేష మార్కెటుకు అవకాశముంది. ఉత్పత్తియగు వస్తువులు బాగుండి, గిరాకీకి తగినట్లుగా ప్రజా బాహుళ్యానికి సంతృప్తికరంగా ఉండినట్లయితే ఏ పరిశ్రమ కూడా తన అవసరములను తీర్చు కొనుటకు రాష్ట్రందాటి బయటికి పోనవసరం వుండదు. ఉదాహరణకు; సిగరెట్ల విషయంలో- ఇది అక్షరాలా నిజమైంది. ప్రస్తుతంవున్న పరిశ్రమలు చాలవరకు ముడిపదార్థాలు, రైలు రోడ్డురవాణా సౌకర్యాలుగల ప్రాంతాలలోనే నెలకొల్పబడి వున్నాయి. ఇకమీదనుంచి, కొన్ని భారీ ప్రాజెక్టులు పూర్తి అయినప్పుడు ఈ పరిశ్రమలకు చౌకరేట్లలో విద్యుచ్ఛక్తి లభించే అవకాశముంది. ముఖ్య పరిశ్రమలను నెలకొల్పాలంటే విద్యుచ్ఛక్తి లభించడంకూడా ఒక ముఖ్య విషయమే.

హైద్రాబాదులో గ్రామాలలో భూములులేనివారి సంఖ్య ఎక్కువగా ఉన్నందున కూలీలు సులభంగా లభిస్తారు. పట్టణ ప్రాంతాలలో స్థిరనివాసం ఏర్పరచుకోవాలనే సంకల్పం వారికుంది. స్థానిక పరిశ్రమలలో కార్మిక చట్టాలు సర్వజనామోద కరంగా లేనప్పటికీ, రెగే కమిటీ నివేదిక ప్రచురింప బడిన తరువాత కార్మిక పరిస్థితి కొంత మేలుగా ఉంది. ఆధునిక పద్ధతుల ప్రకారం కార్మికులను పనిలో చేర్చుకొని, వారి సంక్షేమానికై అవిరళకృషి చేసినట్లయితే కార్మిక సరఫరాలకు సంబంధించిన సమస్య ఇక్కడ అగ్రశ్రేణికి చెందిన ఏ పరిశ్రమకు కూడా చిక్కు కల్గించదు.

ఇక్కడ పరిశ్రమలను పెంపొందించుటకు రాష్ట్ర ప్రభుత్వం చాలా కృషి చేసింది. అయితే కొన్ని యితర సంస్థలు కూడా ఇందులో కొంత శ్రద్ధ వహించాయి. ఈ సంస్థలు పరిశ్రమలకు కేవలం ఆర్థిక సహాయం మాత్రమే చేస్తుండడం వల్ల, ఆర్థిక ఇబ్బందులు ఏర్పడినపుడు వాటి నిర్వహణను పారిశ్రామిక ధర్మకర్తృత్వ నిధిపరం చేస్తుందేవి. ఈనిధి నిర్వాహకులు తమ చేతిక్రిందికి వచ్చిన పరిశ్రమల నిర్వహణకై ప్రతినిధులను నియమిస్తారు. ప్రజోపయోగకరమైన పారిశ్రామిక సంస్థలు మరియు ఆల్కహాలు ఫ్యాక్టరీలపై ప్రభుత్వమే నేరుగా యాజమాన్యం వహిస్తుంది. కొన్ని పరిశ్రమలవిషయంలో వాటి మేనేజిమెంటుప్రయివేటు సంస్థలకు వప్పగించబడుతాయి.

మేనేజింగ్ ఏజెంట్లు ప్రయివేటు పరిశ్రమలలో చాలా వాటికి ప్రధాన నిర్వాహకులుగా వున్నారు. డైరెక్టర్ల సంఘం వారు ఒక పరిశ్రమను స్వయంగా నిర్వహిస్తున్నారు. ఏ సంఘంలోకూడా టెక్నికల్ డైరెక్టర్ అంటూ ఎవ్వరూలేరు.

## ముడిపదార్థాలు

ఈ రాష్ట్రంలో బంకమట్టి, ఖనిజములు, వనస్పతి నూనెలు మున్నగు పారిశ్రామిక ముడిపదార్థాలు సమృద్ధిగా లభిస్తాయి. వీటిని సంపూర్ణంగా వినియోగించుటకు శక్తిసామర్థ్యాలు... మతలుగల పారిశ్రామికసంస్థ ఏదికూడా ఇంతవరకు నెలకొల్పబడలేదు. కొన్ని సందర్భాలలో ముడిసరుకు రూపంలో నూనెగింజలు భారీ ఎత్తున ఎగుమతి అవుతున్నవి. ఈవిధంగా నూనెగింజలు ముడిపదార్థ రూపంలో ఎగుమతి కావడం రాష్ట్ర ఆర్థికాభివృద్ధికి దోహద మివ్వదు.

రాక్షసిబొగ్గు, బంగారం, ఇనుము, ఉక్కు, సిమెంటు, కృత్రిమసిల్కు, కాగితం, చక్కెర, నూనె, టెక్స్‌టైల్స్, సిగరెట్లు—ఇక్కడ భారీపరిశ్రమలలో ముఖ్యమైనవి. బొగ్గు గనులు త్వరితగతిని అభివృద్ధి పరచబడినవి. వీనిని ఇంకనూ విస్తృత పరచుటకు ఇప్పుడు పథకములు తయారుచేయబడినవి. షాహాబాదులో మేలురకం సిమెంటు ఉత్పత్తి చేయబడుచున్నది. గోదావరిలోయలో ఆసిఫాబాదువద్ద క్రొత్తగా ఒక సిమెంటుఫ్యాక్టరీని నెలకొల్పే విషయమై సమాలోచింపబడుతున్నది. ఈ ప్రాంతంలో సిమెంటుకు కావలసిన ముడిసరుకులు సమృద్ధిగా లభిస్తాయి. సిర్పూరు పేపరుమిల్లు వెదురు అడవి మధ్యలో నెలకొల్పబడింది. దానికి కావలసిన నీరు, సున్నపురాయి, సమీపంలోనే విరివిగా లభిస్తాయి. ఈ స్థలానికి సమీపంలోనే బొగ్గు ప్రాంతం కూడా వుంది.

నిజాం చక్కెర ఫ్యాక్టరీలో ఆధునిక యంత్రపరికరము లున్నప్పటికీ, రాష్ట్రంలో ఉత్పత్తిఅయ్యే చెరుకుపంటనంతా వినియోగించే శక్తిసామర్థ్యాలు దానికిలేవు. కనుక రాష్ట్రంలో వివిధ భాగాలలో ఇంకా అనేక ఫ్యాక్టరీలను నెలకొల్పుటకు అవకాశాలున్నాయి. భారతదేశంలో పొగాకు పండించే ప్రాంతాలలో హైదరాబాదు ఆరవస్థాన మాక్రమించియున్నది. ఇక్కడ సిగరెట్ ఫ్యాక్టరీ అభివృద్ధిపొందినది. దీనిని ఇంకనూ విస్తృతపరచుటకు అవకాశమున్నది.

ప్రపంచంలో నూనె గింజలను అధికంగా ఉత్పత్తిచేయు రాష్ట్రాలలో హైద్రాబాదు ఒకటి. ఈ నూనెగింజలను ఇక్కడనే పూర్తిగా ఉపయోగించేటట్లయితే అనేక వనస్పతి ఫ్యాక్టరీలను నెలకొల్పుటకు వీలుంటుంది. ఇక్కడ చిరకాలంనుంచి నాటురకం యంత్రాలద్వారా నూనెగింజలనుంచి నూనె ఉత్పత్తి చేయబడు తున్నది. ప్రభుత్వం గింజల ఎగుమతిని తగ్గిస్తూ నూనె ఉత్పత్తిని ప్రోత్సహించినప్పటికీ నూనె పారిశ్రామికులుమాత్రం ముందుకు రాలేదు.

హైద్రాబాదులో రెండవ ముఖ్యమైన పంట ప్రత్తి. మొత్తం సేద్య భూమిలో ౧౩ శాతం భూమి ప్రత్తిపంట కొరకు సాగుచేయబడుతున్నది. భారత దేశంలో ప్రత్తి పండించే రాష్ట్రాలలో హైద్రాబాదు తృతీయస్థానం ఆక్రమించినది. ప్రస్తుతం అనేక మిల్లులు ఈ ప్రత్తిని వినియోగిస్తున్నవి. ఇక్కడి ప్రత్తి ఇంకనూ విశేషంగా వినియోగింప బడుటకు చాలా అవకాశాలున్నాయి.

ఆధునిక శాస్త్రీయ పద్ధతులలో పరిశ్రమలను నిర్వహించి వాటికి తగురీతిగా సహాయపడుటకై ౧౯౪౪ సం. లో శాస్త్రీయ మరియు పారిశ్రామిక పరిశోధనకై హైద్రాబాదులో కేంద్ర పరిశోధనాలయాలు నెలకొల్పబడినవి. క్రొత్త పద్ధతిలో వస్తువులను ఉత్పత్తిచేసి, పాత పద్ధతులను తగురీతిగా అభివృద్ధిలోకి తెచ్చుటకు ఈ పరిశోధనాలయాలు కృషి చేస్తున్నవి. ఇక్కడ ప్రస్తుతం గానుగపిండి, పొట్టు, ప్రత్తి గింజలు, బొగ్గు మున్నగు వాటిని గూర్చి పరిశోధనచేయబడుతున్నది. ఇటీవవలనే వీటిలో పరిపాలనా నిర్వహణకు

సంబంధించిన కొన్ని సంస్కరణలు కూడా ప్రవేశపెట్ట బడినవి.

## పరిశ్రమల ఆరంభదశ

గత శతాబ్ది అఖరుదశలో ఇక్కడ రెండు టెక్స్టైల్ మిల్లులు నెలకొల్పబడినవి. ఆ తర్వాత పరిశ్రమలశాఖ ఒకటి తెరువబడింది. ఇక్కడ కొన్ని పరిశ్రమలను స్థాపించే నిమిత్తం సాధ్యాసాధ్యములను పరిశీలించుటకు బయటి నుంచి కొంతమంది నిపుణులు ఆహ్వానింప బడినారు. ౧౯౧౮ సం. లో మిస్టర్ మేక్‌ఫీల్డు అనునాతడు పరిశ్రమలకు సంబంధించిన అనేక క్రొత్త సూచనలను చేస్తూ రాష్ట్ర ప్రభుత్వానికి ఒక నివేదిక సమర్పించాడు. ఈ నివేదికలో చక్కెర, మోటార్ స్పిరిట్ ఉత్పత్తికి పూనుకొనుటకు అవకాశా లున్నాయని పేర్కొన బడింది. ఈ నివేదికకు నిజాం ప్రభుపు తమ ఆమోదం తెలిపారు. దీని పర్యవసానంగా వాణిజ్య పరిశ్రమలశాఖ తెరువ బడింది. ఈశాఖ డైరెక్టర్ ఆల్కహాల్ ఫ్యాక్టరీకి సంబంధించిన సాంకేతిక విషయాలను నేర్చుకొనుటకు విదేశాలకు పంపబడినారు.

షాహాబాదులో ఒక ఫ్యాక్టరీ తెరువ బడింది. భారీయెత్తున నూనె పరిశ్రమను నెలకొల్పుటకు చేయబడిన ప్రయత్నాలు విఫలమైనాయి. ౧౯౨౮ సం. లో నాందేడులో క్రొత్తగా ఒక టెక్స్టైల్‌మిల్లు తెరువబడింది. హైద్రాబాదు నగరంలో గ్లాసు ఫ్యాక్టరీ, వరంగల్‌లో ఎముకలపిండి ఉత్పత్తిచేయు ఫ్యాక్టరీ తెరువబడినాయి. ప్రభుత్వం స్వయంగా సబ్బుల ఫ్యాక్టరీని నెలకొల్పింది. అయితే ఆతరువాత కొంతకాలానికి దానిని ప్రయివేటు వ్యక్తులకు పప్పగించింది. కామారెడ్డిలో ఆల్కహాలు ఫ్యాక్టరీ కూడా తెరువ బడింది.

౧౯౨౯ సం. లో పారిశ్రామిక ధర్మకర్తృత్వనిధి ప్రారంభించబడిన తరువాత, భారీపరిశ్రమలకు, చిన్న పరిశ్రమలకు ఆర్థికసహాయం యివ్వబడింది. కొన్ని పరిశ్రమలవిషయమై ప్రోత్సాహాలుకూడా నేకరించబడినాయి. ఈనిధి వరంగల్, నాందేడులలోని టెక్స్టైల్ మిల్లుల కంట్రోలును తనచేతిక్రిందికి తెచ్చుకొన్నది. పరిశ్రమలను స్థాపించుటకు అనువైన ప్రాంతాలను ఎన్నుకునే విషయమై ఒక కమిటీ నియమించబడింది. ఈ కమిటీ సిఫారసు ఫలితంగా, ముషీరాబాదు ప్రాంతంలో వజీర్ సుల్తాన్ టొబాకు కంపెనీవారు తమ ఫ్యాక్టరీని స్థాపించారు. ఆతరువాత హ్యూంపైప్ కంపెనీకూడా నెలకొల్పబడింది.

క్రమేణా అనేక ఫ్యాక్టరీలు తెరువబడినాయి. ౧౯౨౯ సం. లో జాయింట్ స్టాకు కంపెనీలు ౨౪ మాత్రమే ఉండగా ౧౯౩౯ నాటికి వాటిసంఖ్య ౭౩ వరకు పెరిగింది.

యుద్ధకాలంలో వినిమయవస్తువులకొరత ఏర్పడినందువల్ల రాష్ట్రంలో అనేక క్రొత్త పరిశ్రమలు తెరువబడినవి.

అహ్మదాబాదులోని పారిశ్రామికవేత్త శ్రీ కస్తూరిబాయి లాల్భాయిని కేంద్రప్రభుత్వమువారు పరిశ్రమల విషయమై ఒకనివేదికను అందజేయమని ఇక్కడికి పంపారు. ఆయన ఇక్కడి పరిశ్రమలను పరిశీలించి నిర్వహణా సామర్థ్యాన్ని పెంపొందించుటకై వాటి యాజమాన్యాన్ని ప్రయివేటు సంస్థలకు పప్పగించాలని సూచించారు. ఇటీవలనే మూడు ఇతర పెద్దపరిశ్రమలు ప్రయివేటు సంస్థల యాజమాన్యానికి మార్చివేయబడినవి.

## భవిష్యత్తులో పరిశ్రమలు

ప్రభుత్వంవారు రెండవ పంచవర్ష ప్రణాళికక్రింద భారీ పరిశ్రమల అభివృద్ధికై పథకములు తయారుచేశారు. ఈపథకములలో ప్రత్తినూలువడుకు యంత్రము, ఫర్టిలైజర్ల ఫ్యాక్టరీ, తోళ్లు పదునుచేయు ఫ్యాక్టరీ, సహకార పద్ధతిన చక్కెరమిల్లు, బంకమన్ను శుద్ధిచేయు కర్మాగారము, నూనె యంత్రములు, షీట్‌గ్లాస్ పరిశ్రమ, మేలురకం విద్యుచ్ఛక్తి పంఖాల ఉత్పత్తి, మోటార్ల విడిభాగాలు, విద్యుచ్ఛక్తిలో నడుచు గడియారాలు, వంటి పరిశ్రమలను స్థాపించాలని తలపెట్టబడింది.

పారిశ్రామికాభివృద్ధికై ప్రాగాటూల్సు కార్పొరేషన్, సింగరేణి కాలరీలు, హట్టి బంగారు గనులను విస్తృతపర్చుటకుకూడా పథకములలో తలపెట్టబడింది. ఇందుకొరకై ప్లానింగ్ కమీషనువారు తాత్కాలికంగా ఈ క్రింది కేటాయింపులను ఆమోదించారు.

| | | రూ. లక్షలలో |
|---|---|---|
| ౧. ప్రాగాటూల్సు కార్పొరేషన్ | రూ. | ౧౫౦ |
| ౨. హైదరాబాదు బంగారుగనులకై ప్రాథమిక పని | రూ. | ౫౦ |
| ౩. సింగరేణికాలరీలను విస్తృతపరచడం | రూ. | ౯౦౦ |
| ౪. తోళ్ళ పరిశ్రమ | రూ. | ౧౦ |
| ౫. సహకార పద్ధతిన చక్కెరమిల్లు | రూ. | ౨౦ |
| | రు. | ౧౧.౩౦కోట్లు |

హైద్రాబాదు రాష్ట్రంలో స్పాంజి ఇనుము ఉత్పత్తి చేయుట కొరకై జెంషడ్‌పూర్‌లోని నేషనల్ మెటలర్జికల్ లేబరేటరీలలో తగు పరిశోధనలు చేయాలని కూడా సూచించబడింది. బెగ్గాసీఅను పదార్థంనుంచి కాగితం తయారుచేయుటకు తలపెట్టబడింది. అందుకు ఒక ఫ్యాక్టరీని బోధన్‌లో నెలకొల్పుటకు అన్ని విధాలా అనుకూలంగా ఉన్నది.

(తరువాయి 44 వ పేజీలో)

# తప్పుడు తూకములు, కొలమానముల పట్టివేత

## ప్రభుత్వం చట్టంద్వారా తీసుకొంటున్న చర్యల వివరణ

తప్పుడు తూకములు, కొలమానములు ఉపయోగించి వర్తకులు అక్రమలాభాలను ఆర్జించడం పూర్వ కాలంనుంచీ మన మెరిగిన విషయమే. వ్యాపారంలో అనేక చెడు అలవాట్లు ఉన్నవి. అటువంటి అక్రమ చర్యలను పట్టుకొని వాటిని నిరోధించడానికై అధికారులు, అనధికార్లు, ఎన్ని చర్యలు గైకొన్నప్పటికీ అవి అలాగే ఉంటూ వస్తున్నవి. ఇందుకు అనేక కారణాలున్నప్పటికీ ముఖ్యమయిన కారణమేమంటే సమాజమే ఈ చెడు అలవాటును హేయమయిన నేరంగా పరిగణించదు. పైగా దానిని కొంతవరకు సహించి పూరుకుంటుంది. తమకు కావలసిన సరుకులు, వస్తువులు సులభంగా ఎల్లప్పుడూ లభిస్తూ వుండాలంటే ఇటువంటి వ్యాపారయుక్తులను చూచి చూడనట్టు పోనిస్తూ ఉండాలనీ, శాసనాలను చట్టాలను పట్టించుకు కూర్చుంటే ఇబ్బందుల పాలవుతామనీ సంఘంలో కొందరు వ్యక్తులు భావిస్తారు.

కాని ఎప్పుడూ ఇలాగే పట్టించుకోకుండా వుండడం మంచిదికాదు. సంఘంలోని ఇతర దొసగులవలెనే ఈ అవినీతిని వంచనను కూడా పట్టుకొని నిరోధించి వ్యాపారరంగంలో నిజాయితీని నెలకొల్పడం అవసరం. పేద ప్రజల శ్రేయస్సుదృష్ట్యానేగాక జాతీయ గౌరవం దృష్ట్యా ప్రజలలో నైతిక స్థాయిని పెంపొందించడం దృష్ట్యాకూడా ఇది అవసరం.

ఈ విషయంలో హైద్రాబాదు రాష్ట్రంలో ౧౯౦౧ మార్చి ౨ వ తేదీన ప్రభుత్వం ఒక చట్టాన్ని అమలులోకి తెచ్చింది. ఈ చట్టం ౧౩౧౦ ఫసలీయొక్క (౩ వ) తూకములు కొలమానముల చట్టమని వ్యవహరింపబడుతున్నది. ఈ చట్టం ప్రవేశ పెట్టడానికి పూర్వం రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో వివిధములయిన తూకపురాళ్లు, కొలమానములు వాడుకలో ఉండేవి, అందువల్ల ప్రజలు తికమక పడేవారు. ఆ తికమకను తొలగించడానికే పై చట్టం ప్రవేశపెట్టబడింది. దాదాపు ౧౧ రకముల మణుగు, శేరు తూకములు, ౧౨ రకముల ఖండీతూకాలు పూర్వం వాడుకలో ఉండేవి. ఇవి జిల్లా జిల్లాకూ, గ్రామగ్రామానికీ వేర్వేరుగా, వివిధాకారములలో వివిధంగా ఉండేవి.

అయితే ౧౯౦౧ సంవత్సరపు చట్టం ఆమోదింపబడినా ఆ చట్టం అమలు జరుగడానికి తగు చర్యలేవీ గైకొనబడలేదు. అందుచేత ౧౯౦౭ లో మరొక చట్టం ఆమోదించబడింది. కాని అది హైదరాబాదు నగరంవరకు మాత్రమే పరిమితమై వుండేది. ఆ చట్టమునకు ౧౯౧౫ ఏప్రిల్ ౬ వ తేదీన నియమావళి తయారుచేయబడి, నగరంలోనూ, నగర పరిసరాలలోను అమలు పరచబడింది.

### కొత్త చట్టం

౧౯౩౪ లో ఈ చట్టం రాష్ట్రంలోని అయిదు జిల్లాలకు వర్తింపు చేయబడింది. కాని తూకపురాళ్ళు అప్పుడు మింటులో తయారుచేయబడుతుండడంచేత అవి అవసరమైనన్ని లభించేవికావు. అందుచేతనే చట్టం అమలు పరచడానికి వీలులేకపోయింది. ఆ తరువాత చట్టంయొక్క పాలనాబాధ్యత వాణిజ్య పరిశ్రమల శాఖకు మార్చబడింది. ౧౯౪౭ లో కొత్తగా మరొక తూకములు, కొలమానముల చట్టం ఆమోదింపబడింది. ఈ చట్టం బొంబాయి రాష్ట్రంలో అమలులో వున్నట్టి చట్టం పద్ధతి ప్రకారమే తయారు చేయబడింది. తరువాత తూకములు, కొలమానముల శాఖ స్థాపించబడింది. కొత్తచట్టం మొదట ౧౯౪౯లో హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలలో అమలులోకి తేబడింది. ఆ తరువాత క్రమేణా ఈ దిగువ

తెలుపబడిన విధంగా వివిధజిల్లాలకు విస్తరింపజేయ బడింది.

౧. హైదరాబాదు సికింద్రాబాదు
మ్యునిసిపల్ హద్దులు ౧-౧౦-౧౯౪౯

౨. ఔరంగాబాదు, నిజామాబాదు,
గుల్బర్గా, రాయచూరు,
హైదరాబాదు జిల్లాలు ౧-౩-౧౯౫౦

౩. పర్భనీ, నాందేడు, ఉస్మానా
బాదు, లాతూరు, వరంగల్,
మహబూబునగర్ జిల్లాలు ౧-౭-౧౯౫౦

౪. కరీంనగర్, బీదర్ జిల్లాలు ౧౫-౫-౧౯౫౧

౫. మెదకు, బీదు, ఆదిలాబాదు,
నల్లగొండ జిల్లాలు ౧-౪-౧౯౫౨

## రెండు లక్ష్యాలు

తూనికలు, కొలమానముల శాఖకు రెండు లక్ష్యములు కలవు. మొదటిది ప్రస్తుత మున్నట్టి వివిధమైన అక్రమ తూనికపు రాళ్లను కొలమానములను నిషేధించి వాటికి బదులుగా సార్వజనీనమైన తూనికపు రాళ్లను కొలమానములను ప్రవేశపెట్టి, చట్టం అమలులో వున్నట్టి ప్రాంతాలలో వర్తకులు, ప్రజలు విధిగా వాటినే ఉపయోగించునట్లు కట్టడి చేయడం. రెండవది ప్రజలు వర్తకులు ఉపయోగించేవి సక్రమంగా, నిర్ణీత ప్రమాణాల ప్రకారం వుండునట్లు చూడడం. తూనికపు రాళ్లు కొలమానాలు నిర్ణీత ప్రమాణాలప్రకారం వుండడమే గాక వాటిని దేనితో తయారుచేయాలి, వాటి బరువు, పొడవు, ఆకారం మొదలైనవి ఎలా వుండాలో కూడా వివరించడం అవసరం. విలువైన రాళ్ల వ్యాపారం మొదలుకొని కట్టెల వ్యాపారం చేసే వర్తకుల వరకు వివిధ తరగతుల వ్యాపారస్తులు ఏటువంటి రాళ్లు, కాటాలు వాడవలెనో కూడా నిర్ణయించడం అవసరం. వీటిని తయారుచేసే దశలోనే జాగ్రత్త వహించి తనిఖీ చేసినట్లయితే తూకపురాళ్లు కొలమానములు చట్టం ప్రకారం ఉండగలవు. చట్టం ప్రకారం వీటిని తయారుచేయగలవారికే లైసెన్సు ఇవ్వబడుతుంది. తయారుచేయబడిన తూకపురాళ్ల పైనను, కొలమానములపైనను లైసెన్సుదారుపేరు వుంటుంది. అట్టివాటిని తూకములు, కొలమానముల శాఖయొక్క లైసెన్సుపొందినటువంటి వ్యక్తులే వ్యాపారస్తులకూ, ప్రజలకూ అమ్ముతారు.

తూకపురాళ్లు కొలమానముల తయారీదారులు తాము తయారుచేసినవాటిని ప్రభుత్వశాఖకు తనిఖీ నిమిత్తమై తీసికొనిపోవలెను. అవి చట్టనిబంధనల ప్రకారం వున్నట్లయితే వాటిమీద ప్రభుత్వ ముద్రవేయబడుతుంది. ఆ ముద్రలో సంవత్సరము మొదలగు వివరము లుంటాయి. ముద్రవున్నట్లయితే అది సక్రమమైనదని నిర్ధారణ అవుతుంది. తూకపురాళ్లు కొలమానములను తనిఖీచేసి అవి సక్రమంగా ఉండునట్లు చూచుటకై పరిసర రాష్ట్రాలలో ఉన్నటువంటి పెద్ద సిబ్బందితో కూడిన పరిపాలనా యంత్రాంగం ఈరాష్ట్రంలోకూడా నిర్వహింపబడుచున్నది.

వర్తకులు ఉపయోగిస్తున్నట్టితూకపురాళ్లు కొలమానములు చెడిపోయి సక్రమంగా లేనివై పోవుటకు అవకాశము వుంటుంది. కాబట్టి వాటిని వర్తకులు తమకు సంబంధించిన ఇనస్పెక్టరుచే ఏడాదికి లేక రెండేండ్లకొకమారు తిరిగి తనిఖీ చేయించుకొని వాటిపై మళ్ళీ ముద్రచేయించుకోవాలని నియమావళిలో ఆదేశింపబడింది. వాటిని మరమ్మతు చేయుడానికి కూడా లైసెన్సు పొందిన మరమ్మతుదారు లుంటారు. వారు రిపేరు చేయడమే కాక వాటిని ఇనస్పెక్టరుచే తనిఖీ చేయించి ముద్రలు కూడా వేయిస్తారు. ప్రభుత్వ శాఖలో కూడా తరిఫీదు పొందిన ఉద్యోగులుంటారు. కనుక ప్రభుత్వ శాఖ కూడా మరమ్మతు కొరకు తగు ఏర్పాట్లు చేయిస్తుంది.

కొన్ని నిర్ణీత ప్రాంతాలకు కొందరు ఇనస్పెక్టర్లు తగు అధికారాలతో నియమింపబడినారు. వారికి కొందరు సహాయకులు కూడా వుంటారు. వీరు తమ ప్రాంతంలోని దుకాణములను అకస్మాత్తుగా తనిఖీ చేసి చట్టం యొక్క నిబంధనలు సక్రమంగా పాటించగలుగునట్లు శ్రద్ధ వహిస్తారు.

# ★ రాజా మహీపతి రాం ★

## హైదరాబాదులో బ్రిటీషువారి ప్రాబల్యాన్ని ఎదిరించిన ప్రప్రథమ భారత వీరుడు

రాజామహీపతిరాం గుజరాతీ బ్రహ్మక్షత్రి కులానికి చెందిన వాడు. బ్రాహ్మణ క్షత్రియ ఉత్తమ లక్షణాలు ఈ కులంవారికి ఉంటాయని ఒక ప్రతీతి. రాజా మహీపతిరాం యొక్క పూర్వీకులను గురించి మనకు యెక్కువగా తెలియదు. అయితే ఈయన మహదాశయం గలవాడనీ, కుశాగ్రబుద్ధియనీ, దూరదృష్టి గలవాడనీ తెలుస్తున్నది. ౧౮ వ శతాబ్ది ఆఖరులోను, ౧౯ వ శతాబ్ది ఆరంభంలోను ఫ్రెంచి, ఆంగ్లేయుల రాజకీయ చైతన్యముల పర్యవసానమును చక్కగా తెలుసుకున్న సమర్థు డీయన.

రాజా మహీపతిరాం రాజకీయ రంగంలో అడుగు పెట్టే పూర్వం మషీరుమ్ముల్క్ దృష్టిని ఆకర్షించాడు. ౧౭౯౭ లో మషీరుమ్ముల్క్ పూనాలో నిర్బంధంలో నుంచి విడుదల అయిన తరువాత మహీపతిరాంను నిజాం ఆలీఖాన్‌కు ఆంతరంగిక కార్యదర్శిగా నియమించాడు. మహీపతిరాంకు దర్బారులో ఉండిన రాజకీయ పరిస్థితులను ఆకళింపు చేసుకొనుటకు ఆ పదవి అవకాశం కల్గించింది. ఆ తరువాత కొంతకాలానికి ముష్యూర్ రేమాండుకు సైనిక కార్యదర్శిగా నియమించ బడినాడు. నిజాం దర్బారులో ముష్యూర్ రేమాండు మంచి పేరు సంపాదించు కొన్నాడు. సైన్యమంతా ఆయన చేతిక్రింద వుండేది. దర్బారులలో ఫ్రెంచివారి ప్రాబల్యాన్ని సంపూర్ణంగా అణగద్రొక్కుటకు ఆంగ్లేయులు కృషిచేశారు. రెసిడెంటుగా విలియం కర్క్ ప్యాట్రిక్ ఉండినప్పటికీ, రేమాండ్ యొక్క అధికార ప్రాబల్యాలు కొరతబడలేదు. రాజా మహీపతిరాం ఔరంగాబాదు బెరారు రాష్ట్రాలకు గవర్నరుగా నియమింపబడినాడు. ౧౮౦౪ సం. లో పిండారీల విద్రోహక చర్యలు మిన్ను ముట్టిన సందర్భంలో వారిపై దాడిచేయ వలసిందిగా బెరార్‌లో వుండిన మహీపతిరాంకు ఆదేశాలు వచ్చినవి. ఆయన క్రింద ౪౦౦౦౦ సైన్య ముండింది. ఆయనకు సలాబత్‌ఖాన్, సుభాన్‌ఖాన్ అను ప్రముఖ జమేదార్లు సహాయకులుగా వుండిరి. పిండారీలపై దాడిజరుగుతూ వుండినప్పుడు అమాత్య పదవులలో మార్పు వచ్చింది. మషీరుమ్ముల్క్ మరణించగా ఆయన స్థానే మీర్ ఆలం నియమించబడినాడు.

ఈ కాలంలో మహారాష్ట్ర నాయకుడైన యశ్వంతరావు హోల్కారు ఆంగ్లేయులకు సింహస్వప్నముగా ఉండినాడు. రాజా మహీపతిరాం ఈ విషయాన్ని వెంటనే తెలుసుకొనగలిగాడు. ఆయన యశ్వంతరావు హోల్కార్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకొనే వాడని విశ్వసించబడుతున్నది. సికిందర్ జా అంతఃపురంలో బ్రిటీష్ వారికి వ్యతిరేకంగా వుండిన పక్షం చాలా దృఢంగా ఉండింది. మీర్ ఆలంను చంపుటకు ఇస్మాయిల్ యార్‌జంగ్ మరియు మహీపతి రాం కుట్ర పన్నుతున్నారని అనుమానించబడినారు. మీర్ ఆలం కొంత కాలంవరకు రెసిడెంటుకోటలో నివసించవలసి వచ్చింది. రాజా మహీపతి రాం కార్యకలాపాలను నిజాం నిరోధించవలసి వచ్చింది. ముష్యూర్ రేమాండ్‌తో స్వల్పకాలంవరకే సంబంధం ఉండినప్పటికీ రాజా మహీపతి యూరపుఖండవాసుల ప్రవర్తనను ఉద్దేశాలను పూర్తిగా అర్థం చేసుకొన్నాడు. దేశీయ రాజులను అణగద్రొక్కి తామే పరిపాలన చేయాలని బ్రిటీష్‌వారు ఎత్తులు వేస్తున్నారని ఆయన వెంటనే పసికట్టినాడు. బ్రిటీష్‌వారు ఏ పని చేసినప్ప

టికీ దానిని వేయి కండ్లతో గమనిస్తూ ఉండేవాడు. మహీపతి రాం నిజాం అపరాధిమానాలు పొందినాడు. నిజాం అతని వ్యక్తిగతసేవకు ప్రతిఫలంగా అనేక జాగీర్లు ఇచ్చాడు. సైనిక దళములు ఉంచుకొనుటకు గూడా ఆయనకు అధికారమిచ్చాడు.

నిజాం ఈస్ట్ ఇండియా కంపెనీతో చేసుకొన్న సంధి ప్రకారం, బ్రిటీష్‌వారు ఎవరితోనైనా యుద్ధం చేయునప్పుడు నిజాం ఆంగ్లేయులకు సహాయంగా ౯౦౦౦ అశ్విక దళం, ౬౦౦౦ పదాతి దళం పంప వలసి వున్నది. ఆ ప్రకారమే మహారాష్ట్రులతో యుద్ధం ఆరంభమయినపుడు సైన్యాలు పంపవలసిందని ఆంగ్లే యులు నిజాంను కోరారు. బ్రిటీష్ వారితో చేరవలసిం దిగా మీర్ ఆలం రాజా మహీపతి రాంకు ఆదేశా లిచ్చాడు. అయితే ఆంగ్లేయులకు సహాయం చేయడం ఆత్మహత్య చేసుకోవడం వంటిదేనని మహీపతి రాంకు తెలుసు. అందుకని వారికి సహాయం చేయడం నిరాకరిస్తూ వచ్చాడు.

## రెసిడెంటు ఫిర్యాదు

రెసిడెంటు కెప్టెన్ సిడెన్ హాం ౧౮౧౬ డిసెంబరు ౬ వ తేదీన పంపిన లేఖలోనుంచి ఉల్లేఖించబడిన ఈ క్రిందివిషయం ఎంతో ముఖ్యమైనది: "బెరారులోని నిజాంపదాతి దళముల పరిస్థితిపై బ్రిటీష్ ప్రభుత్వం తీవ్ర మైన శ్రద్ధ వహించాలి. మహీపతి రాం కనుసన్నలలో మెలగుతున్న సైనిక దళాలన్నీ ముష్యూర్ రేమాండ్ ప్రభావానికి లోబడియున్నవి. ఈ దళాలకు ఫ్రెంచి దుస్తులు ఇవ్వబడుతున్నవి. అవి ఫ్రెంచి తర్ఫీదు పొందుతున్నవి. వాటికి ఆజ్ఞలు ఫ్రెంచి భాషలోనే ఇవ్వబడుతున్నవి. ఈ దళాలు సహజంగా ఫ్రెంచి వారికే సహాయపడుతాయి. ఈ పరిస్థితికంతా రాజా మహీపతి రాం మూలకారకుడు. డ్రేపర్ అను ఆంగ్లేయ అధికారి ఆంగ్ల సాంప్రదాయ ప్రకారం సైన్యాలకు తర్ఫీదు ఇవ్వాలని తలుస్తున్నాడు. అయితే అవి ఆయన ఆజ్ఞలను శిరసావహించుటకు నిరాకరించినవి. సైన్యంలో అలజడిని లేకుండా చేయు టకు ఆయన వారి కోరికను మన్నించవలసివచ్చింది. ఈ సైన్యాలను స్వయంగా ఆజ్ఞాపిస్తున్న వ్యక్తి క్లిమెంట్ అనువాడు. ఈయన స్పెయిన్ దేశస్థుడు. మహీపతి రాంకు నమ్మిన బంటు. బ్రిటిషు ప్రయోజ నాలకు తీవ్రవ్యతిరేకి." అంతేగాక సైన్యంలో బ్రిటిషు వారిపట్ల అసంతృప్తిని వ్యాపింపచేయుటకు గుప్తంగా పనిచేసే ఐరోపా దేశీయులు యూరేషియన్లు చాలా మంది ఉన్నారని యీ లేఖ తెలుపుతున్నది. అందు కని రెసిడెంటు ఈ క్రింది సూచనలు చేశాడు. "ఈపరి స్థితిని తొలగించి, ఆంగ్లేయ అధికారులకు తగు ప్రాబల్యం కల్పింపజేయుటకై బెరారులో ఆంగ్లసైనిక దళం ఒకటి ఉండడం అత్యవసరం."

రెసిడెంటు చేసిన ఫిర్యాదులు రెండు పరిణామా లకు దారితీసినవి. మొదటిదేమంటే హైదరాబాదులో నిజాం డబ్బుతో ఆంగ్లేయుల అదుపుఆజ్ఞలలో మెలగు సైన్యమును ఏర్పాటుచేయుటకు రెసిడెంటు పునాదులు వేశాడు. రెండవది ఈ సైన్యాలు ఆంగ్లేయులకు తలొగ్గి సహాయపడుతాయి. మహీపతిరాంను లొంగ దీసి నిజాం సైనిక దళములనుంచి బ్రిటిష్ వ్యతిరేకత గల విదేశీయుల ప్రభావాన్ని మూలచ్ఛేదం చేయుటకై రెసిడెంటుపై ఫిర్యాదులు చేశాడు.

## మహీపతిరాంను తొలగించుటకు ప్రయత్నం

రెసిడెంటు చేసిన సూచనలను అమలు పరచాలని మీర్ ఆలం నిజాంను అభ్యర్థించాడు. ఈ సూచనలు రాజా మహీపతిరాంనే గాక నిజాంనుకూడా లొంగ దీయుటకు ఉద్దేశింపబడినవి. మహీపతిరాంను బెరార్ నుంచి ఔరంగాబాదుకు మార్చివేయుటకు ప్రతిపాదించ బడింది. రాజా మహీపతిరాంను అతని బంధుమిత్రు లతోపాటు హైదరాబాదు రాష్ట్రంనుంచి వెళ్లగొట్టా లని మీర్ ఆలం, రెసిడెంటుల అభీష్టమై వుండింది. వీరిద్దరూ పన్నిన పన్నాగం నిజాంకు ఆయన మంత్రికి మధ్య తీవ్రవిభేధాలకు దారితీసినప్పటికీ, రెసిడెంటు తన రాజకీయ నైపుణ్యంతో వారిద్దరిమధ్య సామరస్యం కుదిరించాడు.

రాజా మహీపతిరాం బ్రిటిష్‌వారికి ప్రబలశత్రువనీ, మీర్ ఆలంను వ్యతిరేకించే పక్షానికి నాయకుడనీ

పరిగణింపబడినందువల్ల, అతని కార్యకలాపాలను గూర్చి వివరంగా తెలియరావడంలేదు. ఎక్కడైనా అతని ప్రస్తావన వచ్చిందంటే అది అతని పతనం సమీపిస్తున్నదని తెలియజేయుటకే ఉద్దేశింపబడినది. నిజాం రాజు దినచర్య పుస్తకంలో "౧౮౦౯ ఏప్రిల్ ౨౪. రాజా మహీపతిరాం పోవుటకు అనుమతించబడినాడు. ౧౮౦౯ డిసెంబరు ౯. రాజామహీపతిరాం స్థానే గోవింద బక్స్ బెరార్ గవర్నరుగా నియమించబడినాడు." అని వ్రాయబడివుంది.

వ్యక్తులను లోబరచుకోవడంలోను, సుప్రసిద్ధులైన వారి స్నేహం సంపాదించి, వారితో సన్నిహిత సంబంధం ఏర్పాటుచేసుకోవడంలోను మహీపతిరాం చాలా నేర్పరి. కెప్టెన్ థామస్ సిడెన్‌హాం రెసిడెంటు పదవిని పుచ్చుకొనుటకు ౧౮౦౯ జనవరి ౩ న హైదరాబాదుకు రానున్నాడని తెలుసుకొని మహీపతిరాం హైదరాబాదునుంచి ముందుగానే బయలుదేరి క్రొత్త రెసిడెంటుకు అహ్వానమిస్తూ ఆయనకు గౌరవ దుస్తులు, ఒక పళ్ళెరంనిండా బంగారు నాణెములు బహుమతి ఇవ్వదలచాడు. కానీ సిడెన్‌హాం వాటిని నిరాకరించి ఆయనను కఠినంగా దూషించాడని తెలుస్తున్నది. ఈ ఉదంతం ఆయన వ్యక్తిత్వాన్ని, నడవడికను కప్పిపుచ్చుతున్నది. రాజా మహీపతిరాం సికిందర్‌జా గౌరవ మన్ననలు పొందినాడని మనకు స్పష్టంగా తెలుస్తున్నది. ఎందుకంటే నిజాం మీర్ ఆలంకు బదులు మహీపతిరాంనే తన మంత్రిగా నియమించ తలచినాడని కొన్ని ప్రస్తావనలవల్ల తెలుస్తున్నది. మీర్‌ఆలం బ్రిటిష్ ఏజెంటుగా పనిచేస్తూ ఈస్ట్ ఇండియా కంపెనీ యోగక్షేమాలకై కృషి చేశాడని తెలుస్తున్నది. రాజా మహీపతిరాం తన రాజకీయపుటెత్తులో విజయం సాధించి ఉండినట్లయితే ఆయన మీర్ ఆలంను పదచ్యుతుని గావించి నిజాం రాజకీయాధికారాలను పటిష్ఠంచేసి ఆంగ్లేయుల ప్రాబల్యాన్ని అరికట్ట గలిగేవాడు.

ఆంగ్లేయుల అధికారం క్రిందికి నీళ్ళు తెచ్చుటకై రాజా మహీపతిరాం ఏ పన్నాగాలు పన్నినాడో హెచ్. జి. బ్రిగ్స్ వ్రాసిన రెండవ సంపుటిలో తెలియగలదు. అందులో ఇలా వ్రాయబడివుంది. "రాజా మహీపతిరాం నగరంనుంచి సరిహద్దు ప్రాంతానికి మార్చబడినాడు. ఈ పదవి అధికారంరీత్యా మంత్రి పదవితో సమానమైనది. అక్కడినుంచి రాజా మహీపతిరాం హోల్కార్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినందుకు బహిష్కరింప బడినాడు." విల్‌మాట్ మరియు బిల్గ్రామి కలసి వ్రాసిన ప్రథమ సంపుటిలో కూడా ఈయన విషయమై ఈ క్రింది విధంగా వ్రాయబడివుంది, "నిజాం....౧౮౦౫ సం. లో రాజకీయ విజ్ఞుడైన మీర్ ఆలంను తొలగించి ఆయనస్థానే బ్రిటిష్ వారితో సంబంధాలు తెగదెంపులు చేయుటకు కృషిచేసిన మహీపతిరాంను నియమించాలని తలచాడు. అయితే సహాయక సైనికదళం మహీపతిరాం జోక్యాన్ని విఫలంచేసి ఆయనను రాష్ట్రంనుంచి తరిమివేసింది. అతరువాత ఆయన హోల్కారు శరణు జొచ్చాడు. అంతేగాకుండా నిజాం బ్రిటిష్‌వారి పట్ల సుముఖుడుగా లేడనీ, ఆయన పశ్చిమ భారతంలో వారి అధికారాన్ని మూలమట్టం చేయుటకై సైనిక కూటంలో చేరుటకు సంసిద్ధుడుగా వున్నాడనీ హోల్కారుకు నచ్చజెప్పినాడు. హోల్కారు మహీపతిరాం మాటలునమ్మి, హైద్రాబాదు రాష్ట్రంలో పెద్ద సైన్యంతో వచ్చి బ్రిటిష్ వారితో పొత్తులేకుండా చేయుటకు నిజాంకు సహాయపడుటకు ఆయన మైత్రిని ఇచ్చగించాడు." రాజా మహీపతిరాంకు బెరార్ గవర్నరు పదవి పోయిన తరువాత హైద్రాబాదులో ఉండుటకు వచ్చాడని తెలుస్తున్నది. ఆయన పరిస్థితి చాలా దైన్యంగా వుండివుండవచ్చు. మంత్రి, రెసిడెంటు ఇద్దరూ అతనికి అన్ని విధాలా ప్రతికూలురుగా వుండిరి. మహీపతిరాం నిజాం యొక్క బక్షీ బేగంతో ఒక దాసీద్వారా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపేవాడని రెసిడెన్సీ కాగితాలలో ప్రస్తావించబడి వుంది. అతని జాబులను హర్కారాలు తీసుకుని పోయేవారు. మహీపతిరాంకు చేతిలో చిల్లిగవ్వ లేకుండా పోయింది. తన సొంత సొమ్ములు, ఆభరణాలు, వస్త్రములు మున్నగు వాటిని కూడా తాకట్టు పెట్టాడు. డబ్బు ఉండిన వాడెవ్వడూ అతనికి

అప్పివ్వలేదు. అతనిక్రింద పనిచేసే వారంతరూ ఆయనను ఏవగించుకొని చూషించారు.

## విప్లవం

ఇట్టి పరిస్థితిలో సికిందర్ జా తనకు ఏమాత్రం సహాయం చేయలేదని మహీపతి రాం కనుగొన్నాడు. నిజాం రాష్ట్రపు ఉత్తర సరిహద్దులను బ్రిటీష్ దళాలు రక్షిస్తూ ఉండినవి. అందుకని ఆయన దక్షిణ సరిహద్దును ఎన్నుకొని షాహపూరుకు సమీపానగల సాగర్ కోటకు వెళ్ళాడు. అక్కడనుండి మంత్రి, మరియు ఆంగ్లేయుల అధికారాన్ని ధిక్కరించాడు. తన క్రింద పెద్ద సైన్యాన్ని సమకూర్చుకొన్నాడు. ఇక ఆయన విధిలేక విప్లవ కార్యకలాపాలను కొనసాగించవలసి వచ్చింది. నిజాం రాష్ట్రంలోను, దక్షిణ మరాఠీ దేశంలోను గోపికీలు చేయించాడు. దేశంలోని జమీందారులు మంత్రికివిజ్ఞప్తులుపంపుకొన్నారు. మంత్రి సాగర్ షాహపూరు పైకి ఒక సైన్యం పంపించాడు. రెసిడెంటు మేజర్ గోర్డాన్‌ను ౨౦౦౦ ఆశ్విక దళంతో పంపినాడు. ఆయనకు సహాయంగా పాయెగా సైన్యాధికారియైన విలియం పామర్‌ను కూడాపంపినాడు. మహీపతి రాం క్రింద ఉన్న సైన్యం యుద్ధానికి సంసిద్ధంగా ఉండింది. ఫిరంగి దళాన్ని కీలకస్థానాలలో ఉంచాడు. యుద్ధరంగంలో అరబ్బులను ఉంచాడు. వారికి సహాయంగా వెనుక రెండువందల మంది రోహిలాలను సిద్ధంగా ఉంచాడు. బ్రిటీష్ సైన్యాలు రెండు భాగాలుగా విభజింపబడినాయి. మేజర్ గోర్డాన్ ఫిరంగి దళాన్ని ఎదుర్కొన్నాడు. ఆయన కడు ధైర్యంతో ముందుకు పోయాడు. కానీ శత్రువు యొక్క బలాన్ని తక్కువగా లెక్కగట్టాడు. అందుకని ఆయన సైన్యానికి విపరీత నష్టం కలిగింది. గోర్డాన్ యుద్ధభూమిలో మరణించాడు. విలియం పామర్ క్రిందఉండిన రెండవ దళం అరబ్బులను ఎదుర్కొనినది. కాని ఈ సైన్యం కూడా పరాజయం పొందింది. విలియం పామర్ ఎల్లో తన ప్రాణాలు మాత్రం కాపాడుకోగలిగాడు. ఈ యుద్ధంలో ధైర్యంగా పోరాడిన మొహమ్మద్ హనీఫ్, జియా ఉద్దీన్‌ఖాన్, ముగ్గురు బ్రిటీషు అధికారులు; పామర్ క్రింద ఉండిన సైన్యంలో ౫౦౦ మంది, గోర్డాన్ సైన్యంలో ౬౦౦ మంది హతమైనారు. నిజాం మరియు ఆంగ్లేయుల సమిష్టి దళాలను ఎదుర్కొనిన ఒక విప్లవ వీరునికి ఇది అమోఘమైన విజయం అని చెప్పవచ్చును. ఈ యుద్ధారంభానికి పూర్వం రాజామహీపతి రాంతో సంప్రదింపులు జరుపవలసిందని విలియం పామర్‌కు సూచనలివ్వబడినాయని తెలుస్తున్నది. అయితే ఈ సంప్రదింపులు విఫలమైనాయి. విలియం పామర్ తాను వ్రాసిన "హైద్రాబాదు సైన్య చరిత్ర" అను పుస్తకంలో ౨౨ వ పేజీలో ఫుట్‌నోటు క్రింద పై సంఘటనలను ఈ క్రింది విధంగా పేర్కొన్నాడు."౧౮౦౮ సం. లో మహీపతి రాం నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేసినప్పుడు ఆయనతో సంప్రదింపులు జరుపుటకు రెసిడెంటు కెప్టన్ సిడెన్ హాం, మంత్రులైన మీర్ ఆలం, చందూలాల్‌గారలు నన్ను ఎన్నుకొన్నారు. రెసిడెంటు కోరికపైన నేరుగా మహీపతి రాంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, సంప్రదింపుల విశేషాలను ఆయనకు తెలియజేశాను." "నిజాం సైన్యాలు ఓడిపోయిన తరువాత జరిగిన యుద్ధంలో నేను పాల్గొన్నాను. అప్పుడు కర్నల్ నాస్రీసర్ క్రింద వుండిన సైన్యం మహీపతిరాంను వెంటాడింది. పర్షియన్ దుబాసియైన మిస్టర్ జార్జి సిడెన్‌హాం అక్కడ లేకపోవడం వల్ల ఆయనస్థానే నేను గూఢచారుల వంటి శాఖకు ఒకదానికి అధికారిగా నియమింపబడి ఉంటిని. ఈశాఖలో హర్కారాలు అనేవారు శత్రువుల పోకడలనుగూర్చి సమాచారం అందజేయుటకు నియమింపబడివుండిరి."

"నిజాం ప్రభుత్వంతో మెసర్స్ విలియం పామర్ కంపెనీయొక్క కొన్ని ఆస్తిపాస్తుల లావాదేవీలకు సంబంధించిన కాగితములు" అను ఒక పెద్ద సంపుటిలో మహీపతిరాంకు పామర్‌తోగల సంబంధాలు ప్రస్తావించబడి ఉన్నాయి. ఈ పుస్తకంలోని వివరాలనుబట్టి ఈ క్రింది విషయాలు తెలుసుకోవచ్చును.

మహీపతిరాంతో సంభాషణలు సంప్రదింపులు జరుపడం చాలా కష్టమైన పని. రాజా మహీపతిరాంకు అతని సోదరుని కుమారుడైన శ్రీపతిరాంకు మధ్య తీవ్రభేదాభిప్రాయం వచ్చింది. బ్రిటిష్‌వారితో ఒక ఒప్పందానికి వచ్చుటకు శ్రీపతిరాం సిద్ధుడైనాడు. అయితే ఆత్మగౌరవంగల మహీపతిరాం సంప్రదింపులకు తీవ్రమైన వ్యతిరేకి. శాంతి నెలకొల్పుటకు సంప్రదింపులు సఫలమైతే సైన్యాలు తీసివేయబడుతాయని సైనికులకు బాగా తెలుసు. రాజామహీపతిరాంకు శాంతి అంటేనే యిష్టంలేకుండా ఉండింది. విలియం పామర్ చర్చలు జరుపుటకువచ్చినపుడు, సైనికులకు ఆయనరాక యిష్టంలేకుండా వుండింది. పామర్‌ను ఖైదుచేసి, ఆయనను చంపివేయాలని సైనికులు తలచారు. సైనికులు పామర్ మహీపతిరాం చర్చలు కొనసాగిస్తున్న ఇంటిలో గుమికూడి బాటను అడ్డగించారు. మహీపతిరాం కూర్చొన్నచోటనే ఖైదు చేయబడుతాడని పామర్ బెదిరించినట్లు తెలుస్తున్నది. సంప్రదింపులు విఫలమైనాయి. అయితే కర్నల్ స్టీవెన్సన్ ఆధిపత్యంక్రింద మరొక పెద్ద సైన్యం పంపబడినపుడు రాజామహీపతిరాం నిజాం రాష్ట్రంనుంచి పారిపోయాడు. ఆయన బాపూజీహోల్కార్‌తో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూ వుండినందువల్ల ఆయన సైనిక దాడులలో చేరి నిజాంపైకి దండెత్తుటకు ఆయనను ప్రోత్సలంచేయవచ్చని తలపోశాడు. అయితే అదృష్టదేవత ఎదురు తిరిగింది. రాజా మహీపతిరాం చాలాక్రూరంగా హత్యచేయబడినాడని అనేకఆధారాలు తెలుపుతున్నవి. అయితే నేటికీ నిలిచియున్న అతని వంశీకులను అడిగి తెలుసుకోగా రాజామహీపతిరాంకు తీవ్రమైన గాయం తగిలినందువల్ల ఆసుపత్రిలో చేర్చుకోబడినాడని ఆ గాయంవల్ల ఆయన అక్కడనే మరణించాడని వెల్లడి అవుతున్నది.

బ్రిటిషువారి అధికారాన్ని ఎదిరించి నిలిచిన ప్రథమ భారతీయుడు, వీరాగ్రేసరుడని చెప్పదగిన భారత సైనికుడూ అయిన మహీపతిరాం జీవితగాథ ఈవిధంగా ముగిసింది.



( 37 వ పేజీ తరువాయి )

## * హైదరాబాదు రాష్ట్ర పరిశ్రమలకు ఉజ్వల భవిష్యత్తు *

భారత ప్రభుత్వం వాణిజ్య పరిశ్రమల మంత్రిత్వ శాఖలో 'గుజ్జు మరియు కాగితం' సలహా సంఘం ఈ విషయమై తీవ్రంగా సమాలోచిస్తున్నది.

కొత్తగూడెంలో సింగరేణి కాలరీల వద్ద రోజుకు ౨౦౦ టన్నుల లోగ్రేడు బొగ్గును వినియోగించుటకై లో టెంపరేచర్ కార్బొనైజేషన్ యంత్రమును నెలకొల్పుటకు అవకాశాలు ఉన్నవి.

రెండవ పంచవర్ష ప్రణాళికలో గ్రామీణ మరియు చిన్న పరిశ్రమలు ప్రోత్సహించ బడుతాయి. హైద్రాబాదు రాష్ట్రంలో చేనేత, ఉన్ని, సిల్కు, ఖాదీ, దంపుడుబియ్యం, తోళ్లు, బెల్లం, కలకండ, కృత్రిమపట్టు, చేతి పరిశ్రమలు, మరియు ఇతర లఘు పరిశ్రమలు గణనీయమైన ప్రగతిని సాధించగలుగుతాయి. గ్రామ మరియు చిన్న పరిశ్రమల అభివృద్ధికి సలహాలిచ్చుటకై నియమింప బడిన కార్వే సంఘం ఇందుకై వలసిన నిధులు కేటాయించింది. శిక్షణ పొందిన సాంకేతిక ఉద్యోగ సిబ్బంది అవసరాలను ఆదుకోగలందులకై శిక్షణ, సర్వే మరియు పరిశోధనలకు సంబంధించిన పథకములు కూడా అమలు పరచ బడుతాయి.

అయితే ప్రభుత్వ రంగంలో తలపెట్టబడిన ప్రణాళిక ఇంతటితో పూర్తికాదు. ప్రయివేటు రంగంలో కూడా పరిశ్రమల అభివృద్ధికి ఉజ్వల భవిష్యత్తు కలదు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద తలపెట్టబడిన జలవిద్యుచ్ఛక్తి థర్మల్ ప్రాజెక్టులు ప్రయివేటు పరిశ్రమకు చౌకధరలలో విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తాయి. వాటికి ఎక్కువగా పరపతి సౌకర్యాలు కల్పించ బడినాయి. ప్రయివేటు రంగంలో లాభసాటిగా నెలకొల్పబడు ముఖ్య పరిశ్రమలలో సిమెంటు రీ-రోలింగ్ మిల్, సైకిళ్ళు, కుట్టు మిషన్లు, ఆముదాన్ని శుద్ధిచేయు కర్మాగారాలు, రంగులు, వార్నీషులు, వనస్పతిని తయారుచేయు ఫ్యాక్టరీలు వున్నవి.



# వార్తలు - విశేషాలు

## నగర రవాణా శాఖలో అనధికార సభ్యుడు

శ్రీ యస్. భోజ్‌రాజ్ స్థానే నగర రవాణా శాఖలో మెదక్ జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు శ్రీ రాజేశ్వరరావును అనధికార సభ్యునిగా రాజప్రముఖ్ నామినేటుచేశారు. ఈ ప్రకటన అధికార గజెటులో ప్రచురించబడిన తేదీ నుంచి ఈ నియామకం అమల్లోకి వస్తుంది.

## ఔరంగాబాదు జిల్లాలో భూముల యాజమాన్యం

౧౯౫౦ సం. హైద్రాబాదు కౌల్దారీ మరియు వ్యవసాయ భూముల చట్టం క్రింద ఔరంగాబాదు జిల్లాలో రక్షిత కౌల్దార్ల స్వాధీనం క్రింద ఉన్న భూముల యాజమాన్యం, సదరు చట్టంలోని ౩౮ వ సెక్షన్ యొక్క ౭ వ ఉపసెక్షన్ షరతుకు లోబడి ఆ రక్షిత కౌల్దార్లకు మార్పిడి చేయబడాలనీ, సదరు చట్టం ప్రకారం ఔరంగాబాదు జిల్లాలో తమ భూస్వాముల నుంచి భూములు కొనుటకు హక్కుగల రక్షిత కౌల్దార్లకు మాత్రమే భూముల యాజమాన్యం చెందాలనీ హైద్రాబాదు ప్రభుత్వం ఇందుమూలంగా ప్రకటిస్తున్నది.

## ఆటవిక సంపదను అనుమతి లేకుండా సేకరించేవారికి శిక్షలు

ఆటవిక సంపదను అనుమతి లేకుండా సేకరించడం హెచ్చుగా జరుగుతూ ప్రభుత్వానికి నష్టం సంభవిస్తున్నది. గనుక అట్టి నేరములను అదుపులో పెట్టడానికి హైద్రాబాదు ప్రభుత్వం ౧౩౬౫ ఫసలీ హైద్రాబాదు ఆటవిక చట్టంలోని ౭౧ సెక్షనును సవరిస్తూ ఉత్తర్వుచేసింది. ఈ సవరణ ౧౯౫౫ సెప్టెంబరు ౨౦ తేదీనాటి ప్రభుత్వ అసాధారణ గెజెట్ నెంబరు ౧౨౧ లో ప్రచురించబడింది.

౭౧ సెక్షన్‌లోని ౩ వ ఉపసెక్షన్ ఇంతకు పూర్వం పరిహారం మొత్తాన్ని రూ. ౫౦ ల వరకు పరిమితం చేసేది. కాని సవరించబడిన ౬౧ వ సెక్షన్ తాలూకు ౩ వ ఉపసెక్షన్ ప్రకారం ఆటవిక సంపదకు సంబంధించిన నేరముల విషయంలో పరిహారం మొత్తం సంపద విలువకు రెండు రెట్లు ఉండవలెననీ, ఏ పరిస్థితిలోనైనా సంపద విలువకంటె పరిహారం మొత్తం తక్కువగా ఉండరాదనీ నిర్ణయించబడింది.

(32 వ పేజీ తరువాయి)

## * జోగిపేటలో సహకార సప్తాహం *

శ్రమ సహకార సంఘముల పనికి ప్రారంభోత్సవం జరుపబడింది.

నవంబరు ౮ వ తేదీన 'విద్యార్థుల దినోత్సవం' జరుపబడింది. మెదక్ జిల్లా స్కూళ్ళ ఇనస్పెక్టరు శ్రీ సుబ్రహ్మణ్యం అధ్యక్షత వహించారు.

నవంబరు ౯ వ తేదీన వ్యవసాయశాఖ ఉపమంత్రి శ్రీ అరిగె రామస్వామి పాల్గొని గ్రామీణులందరూ సహకార సంఘములద్వారా తమ ఆర్థికాభివృద్ధిని సాధించాలని ప్రబోధించారు.

నవంబరు ౧౦ వ తేదీన 'స్త్రీల దినోత్సవం' ఉపమంత్రిణి శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మగారి అధ్వర్యమున జరిగినది.

నవంబరు ౧౧ వ తేదీన 'ప్లానింగు దినోత్సవం' శ్రీ వి. బి. రాజుగారి అధ్వర్యాన జరుపబడినది. ★

# హైద్రాబాదులో అభివృద్ధి కార్యకలాపాలు

### శ్రీ యస్. కే. డే ప్రశంస

భారత ప్రభుత్వపు కమ్యూనిటీ ప్రాజెక్టుల అడ్మిని స్ట్రేటరు శ్రీ యస్. కే. డే. హైద్రాబాదు రాష్ట్రంలో ౭ రోజులు పర్యటించి వరంగల్. మెదకు, బీదరు, ఉస్మానాబాదు, గుల్బర్గా, బీడు, ఔరంగాబాదులలోని ౧౪ కమ్యూనిటీ ప్రాజెక్టులను, యన్. ఇ. యస్. బ్లాకులను సందర్శించారు.

శ్రీ యస్. కే. డే తమ పర్యటనను ముగించుకొని కమ్యూనిటీ ప్రాజెక్టులలో జరిగిన అభివృద్ధిని ప్రశంసిస్తూ ఇలా అన్నారు: "హైద్రాబాదు రాష్ట్రంలో గత ఒక సంవత్సరంలో అభివృద్ధి కార్యక్రమం ఎంతో ముందుకు పోయింది. భౌతికంగా కొన్ని విజయాలు సాధించబడినవి. ఇతర రంగాలలో పని చేయు వ్యవస్థా విధానంలో కూడా ఎంతో అభివృద్ధి కనిపిస్తున్నది. హైద్రాబాదు రాష్ట్రంలో అభివృద్ధి కార్యక్రమం పట్ల ప్రజల ఉత్సాహం ఎల్లప్పుడూ సమధికంగా ఉంటూవున్నది. కొన్ని ప్రాజెక్టులలో వారు చాలా ఉన్నతస్థాయిని కూడా అందుకున్నారు. నేను చూచిన ప్రాజెక్టు లన్నిటికంటే గుల్బర్గాలోని సామాజికాభివృద్ధి ప్రాజెక్టు అన్నివిధములా చాలా అభివృద్ధిచెందినట్లుగా కాన్పిస్తున్నది. దేశం మొత్తం మీద ఇదే చాలాఅత్యుత్తమముగా పనిచేయు బ్లాకులలో ఒకటని నిశ్చయంగా చెప్పవచ్చును." శ్రీ యస్. కె. డే ఇంకా ఇలా అన్నారు: "గ్రామీణ ప్రాంతాలలో క్రొత్త పాఠశాలలు తెరువడంలో హైద్రాబాదులో గొప్ప కృషి జరిగింది. ఇక్కడ గ్రామీణ గృహ నిర్మాణ కృషి ప్రశంసనీయంగా ఉన్నది. ఈ విషయంలో దేశం మొత్తంలో పోల్చిచూచినట్లయితే హైద్రాబాదు అన్నిటికంటె ప్రశంసనీయమైన కృషి చేసిందని చెప్పవచ్చు. ఈ రాష్ట్రంలో వెనుకబడిన తరగతులవారికి ఇండ్లకాలనీలు ఏర్పాటుచేసే విషయానికి ఎక్కువ ప్రోత్సాహ మివ్వబడుతున్నది. అనేక కాలనీలు నిర్మింపబడుతున్నవి."

# ౧౯౫౯ మార్చి తరువాత నల్లమందు వాడకంపై నిషేధం

ప్రజారోగ్యం దృష్ట్యా అంతర్జాతీయ నిర్బంధాల దృష్ట్యా, భారత ప్రభుత్వంవారు మత్తుకొరకై నల్లమందును ఉపయోగించడాన్ని, ౧౯౫౯ మార్చి ౩౧ నుంచి పూర్తిగా నిలిపివేయుటకు నిర్ణయించారు. దీనిని క్రమేణా రద్దుచేయడానికి నల్లమందు ఉత్పత్తి సాలీనా ౧౦ శాతం తగ్గింపుచేయబడుతున్నది కూడా.

ఈ పథకం విజయవంతంగా అమలు జరుగగలందులకై ప్రజలు ప్రభుత్వంతో సహకరించాలని కోరబడుతున్నారు. నల్లమందుకు అలవాటు పడినవారు కూడా ఇప్పటినుంచే క్రమేణా దాని వినియోగాన్ని తగ్గించాలని ప్రత్యేకంగా కోరబడుతున్నారు. ఈ విధంగా చేసేటట్లయితే ౧౯౫౯ మార్చి ఆఖరు తరువాత వారికి నల్లమందును పూర్తిగా విడిచిపెట్టడం సాధ్యంకాగలదు. నల్లమందు తీసుకొనే అలవాటు పోగొట్టుకోవాలంటే దగ్గరలో వున్న ఏ ప్రభుత్వ ఆసుపత్రిలోనైనా చికిత్స పొందడం మంచిది.

నల్లమందు అలవాటువున్న వారికి ౧౯౫౯ మార్చి ౩౧ వరకు నల్లమందు సరఫరాను క్రమబద్ధం చేసే దృష్టితో వారు తమకు సంబంధించిన కలెక్టరు ఆఫీసులలో తమతమ పేర్లను రిజిస్టరు చేయించుకోవాలని సలహా యివ్వబడుతున్నది. అందుకొరకై ౧౯౫౬ జనవరి ౧ తేదీలోగా వారు నిర్ణీతఫారంలో సివిల్ సర్జన్‌నుంచి కాని లేక తాలూకా వైద్యాధికారి నుంచి కానీ తమకు నల్లమందు అలవాటువున్నట్లు సర్టిఫికెటు దాఖలు చేయాల్సివుంటుంది.

## మిగులు భూముల స్వాధీనం

ఖమ్మం — ఔరంగాబాదు జిల్లాలలోను, వరంగల్ జిల్లాలోని ములుగు తాలూకాలోను నిర్ణీత ప్రాంతాలలో ఉన్న మిగులు భూములను సమర్థవంతంగా నిర్వహించి ఆ ప్రాంతాలలో సహకార సంస్థలను అభివృద్ధి పరచే దృష్టితో ౫౩-సి సెక్షన్ క్రిందగానీ లేక ౫౩-బి సెక్షన్ క్రిందగానీ వాటిని ప్రభుత్వం స్వాధీన

వరచుకోవడం అవసరమని భావించబడింది. కనుక సదరు సెక్షన్ల ప్రకారం సంక్రమించిన అధికారాలను పురస్కరించుకొని ౧౯౫౬ మార్చి ౧ వ తేదీనగాని లేక ఆ తేదీ తరువాత గాని పైన పేర్కొనబడిన ప్రాంతాలలోని మిగులు భూములను ప్రభుత్వం స్వాధీన పరచుకొని వాటిని నిర్వహించాలని రాజప్రముఖ్ ఆదేశించారు. ప్రజోపయోగం దృష్ట్యాను, భూములు లేని రైతులకు స్థిరనివాసం కల్పించే దృష్ట్యాను రాజప్రముఖ్ పై ఉత్తర్వులు జారీచేశారు.

౧౯౫౦ సం. హైదరాబాదు కౌల్దారీ, వ్యవసాయ భూముల చట్టంయొక్క ౫౪ వ సెక్షన్‌ద్వారా సంక్రమించిన అధికారాలను పురస్కరించుకొని ఆ చట్టంలోని ౬ వ అధ్యాయపు నిబంధనలు సిద్దిపేట తాలూకాలోని ఈ క్రింది ౧౧ గ్రామాలకు వర్తించాలని రాజప్రముఖ్ ఆదేశించారు.

౧. కుచ్నారుపల్లి, ౨. మంగోలి, ౩. తిప్పారం, ౪. యర్రిపల్లి, ౫. లక్ష్టారం, ౬. మదంపూరు. ౭. సింగారం, ౮. కోనాయపల్లి, ౯. మదపల్లి, ౧౦. మద్దూపూరు, ౧౧. తిమ్మారెడ్డిపల్లి.

## రాష్ట్రీ రవాణా అధికార సంఘం

కీ. శే. శ్రీ జి. యస్. ఖాన్ స్థానే శ్రీ నరేంద్రజీ యం. యల్. ఏ. రాష్ట్ర రవాణా అధికార సంఘంలో సభ్యుడుగా నామినేట్ చేయబడినారు. శ్రీ జి. యస్. ఖాన్‌కు సభ్యులుగా వుండుటకు ఇంకా మిగిలివున్న గడువువరకూ, ఆ తరువాత మరొకరు నియమింపబడునంత వరకూ శ్రీ నరేంద్రజీ సభ్యులుగా వుంటారు.

## ఐ. ఏ. యఫ్. విద్యాపరీక్ష

హైదరాబాదు ప్రభుత్వం క్రింది ఉద్యోగాలకు నియామకం విషయంలో భారతవైమానిక దళం వారి విద్యాపరీక్ష సర్టిఫికేటు మెట్రిక్యులేషన్‌తో సమానంగా పరిగణించబడింది.

## పారిశ్రామిక కార్మిక సంఘాల పరిగణన

ప్రభుత్వం తమయొక్క పారిశ్రామిక సంస్థల కార్మిక సంఘాలను ఈ దిగువ షరతుల ననుసరించి పరిగణించగలదు:

౧. ఆ సంఘం ప్రభుత్వ పనివారలలో ఒక విశిష్టమయిన వర్గానికి చెంది వుండాలి.

౨. అదే వర్గమునకు చెందిన ప్రభుత్వపు పనివారలందరికీ ఆ సంఘంలో సభ్యులుగా చేరే అర్హత వుండాలి.

౩. ఆ సంఘం భారత ట్రేడుయూనియనుల చట్టం క్రింద రిజస్టరు చేయబడి వుండవలెను.

పరిగణింపబడినట్టి ఏ సంఘమునకూ ప్రభుత్వం యొక్క ప్రత్యేక అనుమతి లేనిదే మరియు ప్రభుత్వం విధించే షరతులకులోబడి వుండనిదే రాజకీయ నిధి అంటూ ఉండరాదు.

## పన్నుల నుంచి మినహాయింపు

౧౯౫౫ సంవత్సరపు హైదరాబాదు మోటారు బండ్ల పన్ను విధింపు చట్టము ననుసరించి కిరాయాకు గాని లేక బహూకరణకుగాని వ్యక్తులను తీసుకపొయ్యే బండ్లు, వ్యాపారనిమిత్తం ఉపయోగించబడే బండ్లు తప్ప మునిసిపల్ కార్పొరేషనులు, మునిసిపాలిటీలు, స్థానిక సంస్థలు మరియు కంటోన్మెంటు బోర్డులకు చెందిన ఇతరములయిన పనులకు మాత్రమే ఉపయోగింపబడే బండ్లను పన్నునుంచి మినహాయించడమైనది.

## కేంద్ర ప్రభుత్వ చట్టాలు

ముఖ్యమైన కేంద్ర చట్టాలను, సాధారణంగా వర్తించే ఇతరచట్టాలను పరిశీలించి వాటిని ఏవిధంగా సవరించవలెనో, పునర్విమర్శ చేయవలెనో, ఏకీకరించవలెనో లేక మరెట్టి విధంగా వ్యవహరించవలెనో విచారణచేసి సిఫారసులు చేసేటందులకై భారత ప్రభుత్వంచే నియమింపబడిన న్యాయసూత్ర విచారణ సంఘం (లా కమీషన్) మొదట ఈ క్రింది కేంద్ర చట్టాలను పరిశీలించడానికి పూనుకున్నది.

౧. ఇండియన్ లిమిటేషన్ ఆక్టు - ౧౯౦౮
౨. ఇండియన్ కంట్రాక్టు ఆక్టు - ౧౮౭౨
౩. స్పెసిఫిక్ రిలీఫ్ ఆక్టు - ౧౮౭౭
౪. ఇండియన్ పార్ట్నర్‌షిప్ ఆక్టు - ౧౯౩౨
౫. నెగోషియబుల్ ఇన్‌స్ట్రుమెంట్ ఆక్టు - ౧౮౮౧

౬. ఇండియన్ రిజిస్ట్రేషన్ ఆక్టు - ౧౯౦౮

౭. సేల్ ఆఫ్ గూడ్సు ఆక్టు - ౧౯౩౦

ఈ చట్టాలను ఏ విధంగా సవరించాలో తమ అభిప్రాయాలు తెలుపదలచుకొన్న వ్యక్తులు ౧౯౫౬ జనవరి ౧౫ తేదీలోపుగా అట్టి అభిప్రాయాలను హైదరాబాదు ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శికి పంపవలెను.

## కమతాల ఏకీకరణ

రాష్ట్రంలోని సగటు ప్రమాణానికి మించి భూములు విభజితమై వున్నట్టి కొన్ని నిర్ణీత ప్రాంతాలలో కమతాలను ఏకీకరించేపని వెంటనే మొదలు కావాలని హైదరాబాదు ల్యాండ్ కమీషన్ సిఫారసు చేసింది. తదనుగుణంగానే నిర్ణీతమైన ౧౦౦ గ్రామాలలో కమతాల ఏకీకరణ పని ప్రయోగాత్మకంగా చేపట్టబడి ఒక సంవత్సరంలోపుగా పూర్తికావాలని ప్రభుత్వం ఆదేశించింది.

## అద్దెకంట్రోలు నియమావళి

౧౯౫౪ సంవత్సరపు హైదరాబాదు ఇండ్ల అద్దె చేవడీలు మరియు లీజ్ కంట్రోలు చట్టాన్ని అనుసరించి తత్సంబంధమైన నియమావళిలో ఒక సవరణ చేయబడింది. ఆ సవరణ ప్రకారం ౧౩౬౩ ఫసలీ హైదరాబాదు అద్దెకంట్రోలు ఉత్తర్వు ననుసరించి ఏవైనా అపీలు చేయబడి వుండి, అట్టి అప్పీలుచట్టం ఆరంభమయ్యేముందు హైదరాబాదు జిల్లా డిస్ట్రిక్టు మేజస్ట్రేటు మరియు సబార్డినేటు జడ్జీ ముందుగాని లేక సికింద్రాబాదు డిస్ట్రిక్టు మేజస్ట్రేటు, మరియు సబార్డినేటు జడ్జి ముందుగాని, లేక జిల్లాలలోనైతే జిల్లా కలెక్టరు ముందుగాని విచారణలో వుండినట్లయితే అట్టి అపీలు చట్టంయొక్క ౨౦ సెక్షనులో వివరింపబడినట్టి అప్పెల్లేట్ అధికారాలకు మార్చబడగలదు.

## గ్రామీణ పరపతి

రాష్ట్రంలోని మొత్తం జనాభాలో నూటికి ౭౧ పంతు జనాభాకు సహకారోద్యమం వర్తించునట్లుగా రాష్ట్ర సహకార శాఖ ఒక కొత్త పథకాన్ని తలపెట్టింది. ఈ పథకాన్ననుసరించి ౯౫౦ పెద్ద పరపతి సంఘాలు స్థాపించబడుతాయి. వీటినే గ్రామీణ బ్యాంకులని కూడా వ్యవహరిస్తారు. వీటి పెట్టుబడి ధనంకూడా ౧ న్నర కోట్ల నుంచి ౨౫ కోట్లవరకు పెంచబడుతుంది. సభ్యత్వం కూడా ౧ న్నర లక్షలనుంచి ౭ న్నర లక్షలకు పెంచబడుతుంది.

అంతేగాక గ్రామీణ పరపతికీ, మార్కెటింగు కార్యకలాపాలకూ సంబంధం ఉండవలెనని కూడా తలపెట్టబడింది ప్రస్తుత ఉన్నట్టి 'టాకా' లనూ సహకార విక్రయ, బహుళార్థ సాధక సహకార సంఘాలనూ మార్చివేసి ౪౯ మార్కెటింగు సహకార సంఘాలను స్థాపించడమవుతుంది. సభ్యత్వంగల సంస్థలు మార్కెటింగు సంఘాల ద్వారానే తమ సరుకులను విక్రయించవలెనని ఒక నిబంధన విధింపబడింది. పంట అంచనాలను హామీగా తీసుకొని వ్యవసాయదారులకు అప్పులివ్వబడుతాయి.

స్వల్పకాలిక ఋణాలకూ వ్యవసాయదారులకు పరపతి సౌకర్యాలకొరకూ ఈపథకంలో రూ. ౧౦ కోట్లు కేటాయింపబడినవి. ఈ ఋణాలను నూటికి ౬ ౧/౪ చొప్పున వడ్డీతో ఏడాదిలోపల తిరిగి చెల్లించవలెను. ప్రస్తుత సంవత్సరం మధ్యకాలిక ఋణాల కొరకై రూ. ౧౫ లక్షలు కేటాయింపబడ్డవి. వీటిని మూడేండ్లలోగా తిరిగి చెల్లించవలెను. ఇవి ప్రత్యేకంగా ఎద్దులను కొనుక్కోడానికీ భూములను సాగుబడికి తేవడానికీ యంత్ర సామగ్రిని కొనుక్కోవడానికి ఇవ్వబడతాయి.

దీర్ఘకాలిక ఋణాలుగా రూ. ౩ కోట్లు ఇవ్వబడుతాయి. వీటిని ౧౦ మొదలు ౧౫ ఏండ్లలోపల తిరిగి చెల్లించవలసి ఉంటుంది. ఇవి వ్యవసాయ భూముల అభివృద్ధి కొరకు, పనిముట్లు పంపింగు సెట్లు, వ్యవసాయ యంత్రాలు కొనుక్కోవడానికీ ఇవ్వబడుతాయి. ఈ మొత్తంలోనుంచి రూ. ౭౫ లక్షలు రక్షిత కౌలుదార్లకు భూకామందులవద్దనుంచి భూములు కొనుక్కోవడానికై ఇవ్వబడుతాయి.





నాగార్జునసాగర్ డాము నిర్మింపబడుచున్న స్థలం దృశ్యం.

